*Lives of Greatmen. No. 2.*

# TIMMARASU.

(A Niyogi Brahmin.)

తిమ్మరుసు చారిత్ర.

1367

by

G. Sreeramamurty.

REVISED AND EDITED BY

RAJA M. BHUJANGA RAU,

Bahadur, Zamindar,

ELLORE.

SECOND EDITION. 1000 COPIES.

A Reprint from the Manjuvani.

1905.

ఆంధ్రదేశ ప్రసిద్ధపుంస్త్రీచరిత్రములలోని

# తిమ్మరుసుచారిత్రము.

ఆంధ్రభారతినిలయము,
JAN 13 1910

ఇది

చిత్రరత్నాకరాదిగ్రంథకర్తలగు

గురుజాడ శ్రీరామమూర్తిగారిచే

రచియింపఁబడి

శ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దర్

జమీందారు వారివలనఁ

బ్రకటింపఁబడినది.

రెండవకూర్పు.

---

**1905.**

***Re-Printed from "The Manjuvani."***

**Ellore.**

శ్రీ

గురవేనమః.

# సాళువతిమ్మరుసు మంత్రిచరిత్రము.

శ్లో॥ శాకాబ్దే బహుధాన్యనామనిశభో - వేదాబ్ధిచంద్రాన్వితే।
కార్తిక్యాంశశివాసరే శుభతిథౌ - సింహాచలస్వామినే।
హారం కర్ణవిభూషణే చకటకే శ్రీకృష్ణరాయాధిపా।
మాణిక్యాంచయ సాల్వతిమ్మనృపతి - ప్రాదాద్ద్విజస్త్వాగ్రణీ॥

శ్రీ సింహాచలస్వామి ఆలయశాసనము.

## సాళువతిమ్మరుసుమంత్రి.

ఇతఁడు నియోగిశాఖా బ్రాహ్మణుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. ఈవృత్తాంతముల వివరించు శాసనముల నీచారిత్రమునందు వివరించెదను. ఇతనికిఁదిమ్మరాజనియుఁ దిమ్మరసయ్యయని మరికొన్ని స్థలములలోఁ దిమ్మరుసు అయ్యంగారనియుఁగూడకలదు. ఇతఁడుబహు బుద్ధిశాలియనియు నాకారణమున దనప్రభునియొక్క విశేషమన్ననలందిదేశప్రసిద్ధుడైనట్లుగాగాన్పించు. ఇతఁడు తెనుంగుదేశమంతట మహామంత్రియుగంధరునితో సమానముగు బుద్ధిశాలియని వి

ఖ్యాతివడసె. అంతట మంత్రియుగంధరుఁడు సంపూర్ణమంత్రియనియు, నతనితో గొన్నిశక్తులలో సమానుఁడగానున్నను, దిమ్మరుసుమంత్రి యర్ధమంత్రియనియును వాడఁబడును.

ఇతని ప్రభుభక్తింగూర్చి.

ఇతఁడుతొలుత కృష్ణదేవరాయుని తండ్రియగు నరసింగరాయనికడను, అతని పెద్దకొడుకగు పెదనరసింహరాయనికడను మంత్రిగానున్నను నాయుష్యకు జగద్విఖ్యాతయశస్సులుకాకుండుటచేత నీతిమ్మరుసుపేరు నంతవ్యాపకములోనికిరాదాయెను. అనంతరము కృష్ణదేవరాయలు రాజ్యపాలనకువచ్చినది మొదలతనిదిగ్విజయములు వ్యాపించినట్లుగానే యీతిమ్మరుసుమంత్రియశస్సు విశేషముగా వ్యాపింపనారంభించె. "మణినావలయం వలయేనమణిః" అనునట్లుగా నీతనివలనఁ గృష్ణరాయలకీర్తియు నతనివలననీతిమ్మరుసుకీర్తియు జగద్విదితమాయెను. ఇప్పటికి జనసామాన్యముగా నొకబుద్ధిశాలి దూరపాలోచనజేయువానింజూచినచో నీతఁడుతిమ్మరుసువంటి బుద్ధిశాలియనివాడుటగల్గుచుండును. కృష్ణరాయలంత రాజుండుటేగల్గినచో దిమ్మరుసంత బుద్ధిశాలియగు మంత్రి లేకపోవునా యనియునుజెప్పుదురు.

## కృష్ణదేవరాయని బాల్యము. తిమ్మరుసురక్షణ.

ఇదివరలోఁ గృష్ణదేవరాయచారిత్రములో నీతిమ్మరుసు కృష్ణరాయని బాల్యములో నతనిసవతితల్లి వలనఁగలిగినయపకారమును, దానిఁ దొలఁగించుటకుఁ దిమ్మరుసు చేసినపన్నాగమును వివరించి యున్నాఁడను. ఆవృత్తాంతమునే విపులముగా నాకృష్ణరాయనాటకములోఁ గూడ సూచించియుంటిని అట్లుగా కృష్ణరాయలఁ దనయింటికిఁ దెచ్చి తిమ్మరుసుమంత్రియతనిని గూఢముగాఁ దనయింటనుంచి, యతివాత్సల్యంబునఁ గాపాడుటయేగాక అతనికివిద్యాబుద్ధులు నేర్పి రాజనీతియు, దండనీతి మొదలగువానిని స్వయముగ నేర్పి యనేకశస్త్రములు సాముగరిడీలం దేర్చి, ధనుర్విద్యాపారంగతుం జేసి యతని యదృష్టకాలమునకై ప్రతీక్షించుచుండె. ఇట్లుండఁ గృష్ణరాయనికి సింహాసనాధిరోహణ సమయము తటస్థమగుడుఁ బన్నీట జలకమార్చి సర్వాభరణభూషితుం గావించి కిరీటాంగదాదులమర్చి యిలుబయలుదేరు సుముహూర్తమిదియేయని తెలియఁబరచె. దానికిఁ గృష్ణదేవరాయఁడును సర్వసిద్ధముగానున్నట్లు తెలిపె. అంతటఁ దిమ్మరుసు కృష్ణరాయనితో నొకరహస్యము జెప్పవలసియున్నదని యొకగదిలోనికిం గొంపోయి తలుపుదగ్గరగాఁ బెట్టియిదె రహస్యమని యొకచెంపకాయఁ దనసత్తువతోఁ గొట్టె. పిడుగు

పాటువలెఁ దనపైఁబడిన దెబ్బకుఁ దలగిరగిరఁదిరిగి కృష్ణ
రాయలు భూమిపయిం జదికిలఁబడియె. తిమ్మరుసుం దనకం
టనీరునించుచు నతనిముందరనే కూర్చుండియుండె. రాయ
లుకొంతవడికిఁ దెప్పిరిలికన్నులువిచ్చి తిమ్మరుసు మొగంబు
వీక్షించె. అపుడుతిమ్మరుసు రాయనింగౌఁగలించుకొని ము
ద్దాడి యన్నా నీశరీరంబునొచ్చెనని నన్ను దూషింపకుము
నేనీపనిం జేయుటకుఁ జేతులాడక యిన్ని దినంబులు నూర
కుంటిని. ఇఁకయూరకున్న స్వామిద్రోహము చేసినవాఁడ
నగుదుననుభీతిచే నిపుడీపనిఁగావించితిని నన్నుమన్నింపుఁడ
నుడుఁ గృష్ణరాయండుఁ దిమ్మరుసు కారణములేనిదియేపని
యుం జేయనివాఁడు నేదిచేసినఁదనయుపయోగార్థమే చేయు
వాఁడని యెఱింగియున్నవాఁడగుటం జేసి తిమ్మరుసుం జూచి
ప్రసన్నుఁడై యిట్లనియె అప్పా! తండ్రిసుతునెందుకుదండిం
చును? పిరిమాత్రోపముండుటచే దండించెనని యనవచ్చు
నా? పుత్రుఁడు మేలుఁ జెందు నుపాయములు తండ్రికిఁ దెలి
యుంగాని పుత్రునికేమి తెలియును దీనినే మహాప్రసాద
ముగాభావించినాఁడను. అనిపల్కి కృష్ణదేవరాయని మర
లమరల నాలింగనంబుజేసుకొని శిరంబుమూర్కొని తిమ్మ
రుసానందబాష్పములు దొరుగనాయనా నీవట్టివాఁడవేకా
వున నేనీసాహసకార్యము జేయఁగలిగితిని. దీని నీవెట్లుగా

భావింతువోయని శంకించుచున్నాడను. అట్టివియగువా
క్యముల నీవేపల్కినాడవు గావున నాసంశయములు వదలి
నాడను. ఇఁక నేజేసినకార్యమునకుఁ గారణముఁ దెల్పెదవి
నుమని యుల్లనిమె. నాయనా నీవింతవఱకుఁ బువ్వులలోఁ
బుట్టి పువ్వులలోఁ బెరిగినాడవు. ఆగర్భశ్రీమంతుఁడవగుటఁ
జేసిసుఖములనేగాని కష్టములనెన్నఁడెఱుఁగవు నీవిపుడుబ
హుజనపరిపాలకుఁడవు కాఁబోవుచున్నాడవు. అంతటనుం
డేమము నీయాజ్ఞానువర్తులము కావలసినవారము గాని
యిప్పుడునీకు బుద్ధులుచెప్పవలసినవారముగాము. దండనా
పారుష్యమువలన ప్రజలకుగల్గుబాధ ప్రభునకుస్వయము
గనన భవమువలన దెలియదేని యట్టిప్రభుఁడు ప్రజలను
క్రూరదండనలపాలుజేసి లోకకంటకుఁ డనిపించుకొనును.
అట్టిదండనాపారుష్యమువలన గిలుగబోవునొప్పి ప్రభువుల
కనుభవములోనుండుట ప్రజలభాగ్యముగదా అట్టిభాగ్య
మునీప్రజలకును అందమూలముగా నీకీర్తివిస్తరించు భా
గ్యమునీకును గల్గించుటకిపుడీ కార్యముంజేసినాడను నీవు
నావాఁడవనునమ్మకముతో నీకన్నివిద్యలలోని మర్మము నీ
వఱకే తెలిపియున్నాడను. ఇంతవఱకు నీవుమాకృష్ణరా
యలవే. ఇపుడునీకుదీనిం దెలుపకున్న నిఁకముందు తెలు
పుమ సేయుటకు వలనుపడదని యీవిద్యనుగూడ నెఱిఁగిం

చినిన్ను రాజ్యముఁ జేయబంపుచున్నాఁడను. ఇఁక బోయి సిం
హాసనాధిరోహణంబు జేసి యాచంద్రార్కస్థాయిగాఁ గీర్తి
నివహించు ప్రజారక్షణము జేయుమని దీవించిన దిమ్మరుసు
నిబుద్ధివిశేషంబునకు రాయండు మిగుల సంతసించి నన్నున
రకబాధనుండి తొలఁగించిన మహాపుణ్యాత్ముఁడవగు నీమే
లెన్ని జన్మములలోఁ దీర్చుకోఁగలను నామానంబెంతయుసం
తసిల్లినది ఈనీమహోపకారంబునకుఁ బ్రత్యుపకారము
పను నేనేమి చేయఁగలను కావున నావందనశతంబుల నం
గీకరింపుడని పాదాభివందనంబాచరించి యతని పునఃపున
రాలింగనంబు జేసియున్న రాయనిందోడ్కొని తిమ్మరుసు వె
లుపలికివచ్చి యతనిని గజారోహణంబు జేయించి తాను ను
పార్శ్వంబున మఱియొక గజంబునెక్కి విశేషోత్సవముతో
మంగళతూర్యములు మొరయఁ బురంబేగించి రాజమందిరం
బునఁ బ్రవేశపెట్టి సుముహూర్తసమయమున సింహాసనా
ధిరోహణంబుఁ జేయించె.

### తిమ్మరుసు పొందినమర్యాదలు.

ఇట్లుగాఁ దిమ్మరుసువలన సింహాసన మెక్కింపఁబడిన కృ
ష్ణరాయలు, తనకు బాల్యప్రభృతి కంటికి ఱెప్పవలెఁ గాచు
చున్న తిమ్మరుసునెడలఁ దాఁజూపవలసిన విశ్వాససూచక
ముగా ననేకబహుమానములు చేసి కొన్నిగ్రామములం

గూడ బహుమానముగనిచ్చి యతనియందేయధికారము సర్వమునుంచి యతనియాజ్ఞానుసారముగానే సర్వకార్యములనిర్వహించుచుండె తిమ్మరుసును రాయలు తనమొదలఁజూపుచువచ్చిన కృతజ్ఞతయును మన్ననయు నెంతయధికముగుచు వచ్చెనో అంతకు నధికముగా జనరంజకముగాఁ బ్రజలనుపరిపాలింపుచుఁ దనప్రభునికడఁదొంటికంటెను నయవినయంబులు చూపుచు రాజ్యతంత్రము నడపుచుండె.

### తిమ్మరుసు పరిపాలన.

తిమ్మరుసునకుఁగల రాజభక్తియుఁ బ్రజాసంరక్షణము దినదినములోకములో వ్యాపింపనారంభింపఁగాఁ బ్రజలందఱు నతిమ్మరుసే తమకేడుగడయని నమ్మి కార్యములలో నతిశ్రద్ధాళులై చేయుచుండిరి. తనకుఁగలభృత్యపరివారసామంతమంత్రివర్గము తిమ్మరుసుని పితృసమునిగా నెన్నిభయభక్తులతోఁదమతమవ్యాపారములను నడుపుకొనుచుండురు. ఇక రాయండును రాజ్యభారమునంతయుఁ దిమ్మరుసుపైనుంచి సర్వకాలములలోఁబండితులఁగూడివిద్యావినోదంబులు సలుపుచునంతసంబునఁగాలంబుగడపుచుండె

### పరరాష్ట్రిల నిర్మూలించు నుపాయము రాయలకు దెల్పుట.

ఇట్లుగాఁగృష్ణరాయలు రాజ్యభారము తిమ్మరుసుమంత్రిపైనుంచి విద్యావినోదములు జేయుచు బ్రమత్తుఁడై యున్న

వర్తమానము శత్రురాజులు దెలిసికొని హారుకృష్ణరాయల
క్రిందనుండు సామంతరాజులఁ గొందఱివిడదీసి వారివలన
సతని రాజ్యములోని వ్యవహార రహస్యములఁ దెలిసి వారి
సహాయమునఁ గృష్ణరాయలఁ జయించుటకును వారికి వి
శేషలాభము గలిగించుటకును నిర్ణయించుకొని సమయ
నిరీక్షణంబు చేయుచు యుద్ధసన్నాహములోనుండిరి. ఇట్టి
వృత్తాంతమును గృష్ణరాయఁడు చారులవలన విని తక్షణమే
ఆస్థానమునకు వచ్చి సింహాసనాసీనుఁడై తిమ్మరుసును బిలువ
నంపె అపుడు రాజభటులు నలుగెలంకులకుఁ బరచి వారినం
దఱిని రాజసభకుఁ దోడ్తెచ్చిరి. తిమ్మరుసును, రాజు తననిమి
త్తమె సమయముగాని సమయమున బిలువఁబనుచుటకుఁ
గారణమేమియైయుండునని యూహించి తాఁ జేయుచున్న
జపముమాని దిగ్గన లేచియు దెవచ్చెదనని రాజభటులకుఁ జె
ల్పి పెరటిలోనున్న * తోటకూరమడిలోఁ గూర్చుని దాని
లోని పెద్దపెద్ద మొక్కల బెకలించి దూరంబున బడవైచి
చిన్న మొక్కల జుట్టును మళ్ళుగట్టి సమీపముననున్న బా
విలోనుండి యుదకము చేదుచు దానిం దెచ్చి యీచిన్న
మొక్కలు దడుపుచుండె. దీనినంతయుఁ జూచిన రాజభటు
లీతఁడు రాజాజ్ఞోల్లంఘన చేయునట్లున్నాఁడు. కాలయాప
నకై యేదోపనిఁ గల్పించుకొనుచున్నాఁడు. వెంటనే రాని

మొదలఁ దమపైఁగూడ రాజున కాగ్రహము తాఁగలదని
యూహించితిరుగ రాజసన్నిధికిఁబోయి తాము రాజాజ్ఞఁ ది
మ్మరుసునకుం దెలిపిన విధంబున నాతఁడు వచ్చుచున్నాఁ డని తె
లిపి కాలయాపనకై చేయుచున్న పనియుఁ దెల్పితడవైనఁ
దాము దండార్హులమగుదుమను భయముతో నేలికకుదీని
ని విన్నవింపవచ్చినారమని తెల్పిరి. కృష్ణరాయలు మిగుల
బుద్ధిశాలిగావునఁ దిమ్మరుసు తనయాజ్ఞోల్లంఘన చేయువాఁ
డు కాఁడని యెఱుంగుంగావున నాతఁడు చేయుచున్న పనితన
నిమిత్తమే యుద్దేశించెనని గ్రహించి దానిననుసరించి తనరా
ష్ట్రములోనున్న పెద్దసామంతులఁ దొలఁగించి వారి స్థాన
ములలోఁ జిన్నసామంతుల నియమించి మీరీ వెంటనే పో
యి మీయధికారములం జెల్లింపుఁడని యాజ్ఞాపత్రికల ని
చ్చి తా రాణివాసంబునకుంబోయె వారును వానింగైకొ
నితమకు వలయు సేనాసహాయముం దోడ్కొని యాక్షణమే
బయలుదేరి కదలియొకరివర్తమాన మొకరికి దెలియకయుం
డునట్లు పెద్దసామంతులఁ దొలఁగించి. వారి సంస్థానముల
నాక్రమించిరి. ఈవృత్తాంతముం దెలిసిన పరరాష్ట్ర ప్రభు
వులు నిరుత్సాహులై తాము చేయుచున్న యుద్ధప్రయ
త్నము మానుకొనిరి. ఇట్టివిశేషోపాయములం దెలిపి తనయా
పదఁ ద్రోలఁగించిన తిమ్మరుసు బుద్ధివిశేషములకుఁ గృష్ణరా

యుండెంతయు సంతసించె. ఇటులనే రాజునకు నరాజ్యము నకుంగలిగిన యనేకోపద్రవంబులే తిమ్మరుసు బుద్ధిబలంబు నఁ దొలఁగించుటకు రాయఁడెంతయు సంతసించుచు నెల్లప్పు డు దిమ్మరుసు నదనతోఁగూడ నుంచుకొని కార్యంబులు న డపుచుండె.

## తిమ్మరుసు మతిప్రజ్ఞ.

ఇట్లుండఁగా రాజొకనాఁడు వాహ్యాళికిఁబోవుచుఁ దిమ్మరుసుంగూడఁ దనతోఁగూర్చుండఁబెట్టుకొని యిష్టాగోష్ఠి సల్పుచుండె. ఇట్లుండగనా యరదము నొక బ్రాహ్మణ గృహ సమీపమునకు వచ్చెను. అంతటనా యింటి యజమానుఁడు మున్న నా లోఁబెట్టిన తిరగఁబోత (తాలింపు) కొఱకై నూనె వాసన పను వచ్చె. దాని నాఘ్రాణించి రాజు తిమ్మరుసుం జూచి మహా రా! ఇంటివా రీనూనె వాసనయొంత శ్లాఘ్యముగా నున్నదో అనుఁడు తిమ్మరుసు చిత్తము దీనికి లవణముఁ గూడ నున్నయెడ ల యింతకంటెను బాగుండును అది తక్కువయైనందుననే మా త్రము కాన్పించుచున్నది. అనుడు రాజు నవ్వి ఘ్రాణమా లముగా రుచియు గ్రహింపవచ్చునాయని ప్రశ్నించె అ ట్టి సందేహము నప్పుడే నివారించెదనని తెలిపి తిమ్మరుసు రాజ భటులం బిలిచి యాయింటి యజమానితోఁ జెప్పి యిప్పుడు తిరుగఁబోతఁ బెట్టిన పదార్థము కొంచెము నాకుఁ దెచ్చి యి

మ్మని చెప్పుమనుడు పోయి యావ త్తమానంబు యజమానికిం దెల్పి. ఆవృత్తాంతంబువిని యావస్తువుందీసికొని తిమ్మరుసుకడకువచ్చి స్వామీ యిదిగో తెచ్చితిననుడు దానినందికొని రాజునకుఁ గొంచెమిచ్చి తాఁగొంచెము నోటనుంచుకొనియె దానిలో నుప్పుపడనేలేదు. అట్టితిమ్మరసునకుఁగల్గు రుచిప్రజ్ఞకు రాజెంతయు సంతసించి యాయింటి బ్రాహ్మణునకుఁగొంత బహుమానమిచ్చి రాయలు తిమ్మరుసుదీనినెటులఁ గన్గొట్టెనని యూహింపుచు నింటి మార్గంబు నంజనియె

ఇట్లువచ్చి తిమ్మరసునకిట్టి ప్రజ్ఞ యెట్లు కలిగియుండునని యూహించి స్వామీమీరింక నేమేమువస్తువులు రుచిచెప్పఁగలరని సంప్రశ్నించె. దానికిఁ దిమ్మరసునవ్వుచు దేవర యెఱిఁగెడి వస్తువుల కన్నిఁటికిని రుచిచెప్పఁగలనని యుత్తరమిచ్చె. అట్టితిమ్మరసు నోడఁబుచ్చు తలంపున రాయలు తానుభక్షించు వివిధములగు పక్షులయొక్కయు, మృగములయొక్కయు, జలచరములయొక్కయుఁ బేరులం జెప్పి వానిలోఁ గొన్ని కొన్నిఁటి రుచు లెట్లుండునని యడుగుడు వానికన్నిఁటికిని స్వభావసిద్ధములగు రుచులు వివరించి చెప్పె. అట్టిదానికియుక్తివేలుగఁ జెప్పలేక కృష్ణరాయుండుమీరుబహుకాల ప్రవర్తకులుగావున లోకానుభవం

బునవీరిం జెప్పియుందురు. దీనికేమైన శాస్త్రికాలున్నవా యనుఁడునుండనే వచ్చునయ్యు నవియన్నియుఁ జనువు వారెవరున్నారు. బుద్ధిచేతనూహించినచోఁ దినకి రుచియును గనకలెక్కయును జెప్పవచ్చునని యుత్తరంబుఁ జెప్పెను

### సమస్తవస్తువులలోఁ దీపియైనవస్తువు.

ఒకనాడు రాయండు పండితగోష్ఠియుండి వారితో లోకంబునయుండెడు సమస్త పదార్థంబులలో దీపియైన వస్తువెద్ది యని ప్రశ్నించె. అట్టిసంప్రశ్నమునకు బుద్ధిశాలులందఱు నాలోచించి బెల్లమనికొందఱు, శర్కరయనికొందఱు, తేనె యని కొందఱుఁ దమతమ యనుభవానుసారంబుగాఁ జెప్పుచు వచ్చిరి. మఱికొందఱు మఱికొన్ని పదార్థముల సమ్మేళనమునఁ బుట్టువస్తువులు తీపుగా నుండునని పల్కిరి. అట్టివారిలో నిగ్గుతేలకుండుటంజేసి కృష్ణరాయలు తిమ్మరుసుంజూచి మీయభిప్రాయమేమని ప్రశ్నించె. అప్పుడు తిమ్మరుసునవ్వుచు లోకమందఱుకాంక్షింపఁబడియు నెవరును గాదనరానిదియు నేనుజెప్పెద వినుండని యది ప్రాణంబుగా దాయనెను. దానికి రాజుమెచ్చెంగాని సభికులు మాత్రము మనస్ఫూర్తిగా నంగీకరింపరైరి. అట్టివారికిఁ దన వాక్యములలోని యథార్థముబోధించుతలంపున సెలవేని నావాక్యములనిప్పుడే లక్ష్యలక్షణ సమన్వయము సేసెదనుఁడు

రాయఁడంగీకరించె. తిమ్మరుసునలుగెలఁకులఁ బరికింపుఁడు నాసమీపంబుననొక బిడ్డనెత్తుకొని యాటలాడుచున్న మర్కటిగానవచ్చె దానింబట్టితెప్పించి పయినున్నయొకదూలమునకుఁగట్టించి యాక్రిందనొక పెద్దమంటఁ బెట్టించెను. ఆ వేఁడికొంతవరకు సహించియుండి సహింపలేక నామర్కటి తనప్రాణపదంబుగాఁ నాపల్లకుఁజూచుచున్న తన పిల్లనెత్తి అగుంలముపయిఁబెట్టి దానిమీఁదఁగూర్చుండియా వేఁడిఁదప్పించుకొనెనట. ఆట్టియద్భుతకార్యంబునకు సభికులందఱుసంతసించి తిమ్మరుసు వాక్యములే యథార్థములనిపల్కుఁడు నావెంటనే యగ్నిజ్వాలల నార్పించి యామర్కటిని దానిపిల్లను సంరక్షించి తిమ్మరుసు సభికులశ్లాఘనలనందెను.

### తిమ్మరుసు విజ్ఞాపన.

ఒకసమయములోఁ దిమ్మరుసు తనవలెనే లోకములో జనులకుఁ జిక్కులొకమారుగా వచ్చునని తెల్పుటకొక పద్యముం జెప్పె నదియెట్లున్న దనఁగా:-

చ. గురువులరాక దాసిమృతి-గుఱ్ఱపుఘాటియు వానలేమియున్ |
బోరుగునప్పుబాధ చెవి-పోటును దొమ్మరులాట యింటిలో
వరసతిగర్భవేదనవి-వాహము విత్తుట యల్లుఁడల్కయున్ |
గరవపుదరిద్రమార్జికము-గల్గునొకప్పుడుకృష్ణభూవరా॥ అని.

## నాడులవిషయము.

మఱియొకసమయంబునఁ గృష్ణరాయలు పండితులతో ననేకనాడులు లోకములో వ్యాప్తమైయున్నవిగదా. వాటిలోనేదిమంచిదో యూహించిచెప్పుఁడని ప్రశ్నించె. అట్టిప్రశ్నమునకుత్తరముగఁ గొందఱు వెలనాడు మంచిదనిరి. ఇంకొకకొందఱు కాసలనాడుమంచిదనిరి మఱికొందఱు ములికినాడు మంచిదనిరి అటుపిమ్మట రాయండుతిమ్మరుసుంజూచి మీయభిప్రాయమేమనుడు కృష్ణరాయలతో నతఁడిట్లనియె మహాప్రభో! విచారశూన్యమైనట్టియు, నిత్యసంతుష్టిం గలిగినట్టియు, సంసారబాధలంటక సంతోషమేప్రధానముగానుండునది. యొక్క-చిన్ననాడేగదా! అంతకంటెమంచిది. యిక నేనాడునుండదనుడు రాయలును, సభికులును, తిమ్మరుసుచెప్పినదే సరియైన సిద్ధాంతమని సమ్మతించిరి.

## వర్ణములవిషయము.

ఒకనాడు ప్రసంగవశంబున నాల్గువర్ణములవారి వృత్తులను వారికిఁ బరిపాలకులయెడఁ గల్గియుండు నెనరును దెలియఁదగును. కావున సభికులాలోచించి వారివారియనుభవముం దెల్పుడనుడు వారిలో బుద్ధిశాలులొక్కొక వర్ణము వారివృత్తాంతము తమతమ యనుభవానుసారంబుగఁ జె

ప్రనారంభించిరి అట్టి వృత్తాంతములకు రాయాదు తిమ్మరు సుదిక్కు మొగంబై యీయభిప్రాయముగూడ నిట్టులనే గదా యనుడు నతఁడు నవ్వుచు నిట్లనియె ఇది యెవరియనుభవ మునుబట్టి వారు చెప్పుచున్న వృత్తాంతమవుటంజేసి దానిలో విశేషసంవాదముతోఁబనియుండదు అందగ్రవర్ణత్రయము యొక్క నెవరు సభికులు నుడివినట్లే యుందురు. కాని నాలవవర్ణములోఁ గృష్యాదులవలన జీవనము చేయుటచేతను విద్యాగంధము నెఱుఁగకుండుటచేతను గేవలము మూర్ఖతయే ప్రధానముగా గల్గి యుందురు. ఆకారణమున వారికిఁ బ్రభువులయెడ నెంతమాత్రము నెనరుండదనివిన్నవించె దానికిసభికులును, రాయలును సమ్మతింపక కృష్యాదులఁజేయుచున్న మాత్రమున వారికి ప్రభువులయెడల నెవరుండదని చెప్పినమాట యనుభవమునకు వ్యతిరేకించి యుండునేమోయని పలికిరి. ఆమాటకుదిమ్మరుసుత్తరము చెప్పక యూరకుండెఁ యాస్థానము చాలించి ప్రభుండు నగరునకుఁబోయినపిమ్మటఁ దిమ్మరుసును ప్రభుని వెంటఁజని నిల్చియుండె. దానింజూచి రాయలు మనము మాట్లాడవలసినదేమయిన నున్నదా యనుడు చిత్తమనితిమ్మరుసిట్లనియె. నేటిదినము సభలో జరిగిన ప్రస్తావనలో నాయభిప్రాయమటుతో నేలికయేకీభవించునట్లుగానుపించుచు

న్నది. సెలవే నాసిద్ధాంతమును లక్ష్య లక్షణ సమన్వయ ము చేసెదను. అనుడు రాజు మంచిది దానికిఁ జేయవలసిన పను లేవయిననున్న వాయనుఁడు దిమ్మరుసు సిట్లనియె. రేపటి దినము నాయెడల నేలిక విశేషాగ్రహము జూపి యెటను న్నఁబట్టి తెండని భటుల కాజ్ఞాపింపుఁడు. అపుడు నేను భయపడి దేశాంతరగతుఁడనైన ట్లభినయించెదను. తరువాయి వృత్తాంతమెప్పటిదప్పుడు మీకే విశదము కాఁగలదు. అనుడు రాయండు దానికి సమ్మతించె తిమ్మరుసు రాజాజ్ఞనొంది గృహంబునకుం జనియె.

తిమ్మరుసు పరారీయగుట.

ఆమరునాఁడు రాయలు సూర్యోదయ సమయంబుననే సభాభవనంబునకు వచ్చి యుగ్రమూర్తిగా నున్నట్లభినయించి తనభటులఁబిలిచి మీరలోఁదగుజనులు నల్వురుపోయి తిమ్మరుసెట్లున్న నట్లుగాఁ బట్టి తెండని యతిభీషణారావంబుతో నాజ్ఞయొసఁగె. ఆవాక్యములకు సభికులును రాజభటులును మిగుల దిగులొంది నేటిదినము తిమ్మరుసునకెద్ది మూఁకీదు మూఁడనున్నది. రాయలిట్లెన్నఁడును తీక్ష్ణతనువహించియుండలేదు. మంత్రి కేమికీడు రానైయున్నదోగదా యని భయమందుచు రాజాజ్ఞానుసారముగా నల్వురు భటులున్ను తిమ్మరుసుగృహంబునకరిగిరి. ఇంట దిమ్మరుసు

రాజాజ్ఞగొనిననాటిరాత్రియే భోజనాదికంబొనరించి యిం
టిహారితోఁదనకు దినములు మంచివి కావుగావుననేటినుం
డి నేనీయూరనుండఁగూడదు. రెండుమాసములకుఁ దిరుగ
మంచిదినములు రాఁగలవనిచెప్పి రాజభటు లెవ్వరేనివచ్చి
తనయునికిపట్టడిగినఁ దమకేమియుఁ దెలియదనియును రా
త్రియేభోజనాంతర మెచ్చటికోపోయెను. అప్పటి నుండియు
నింటికిరాలేదని చెప్పుండని చెప్పి మరునాడుమాధ్యాహ్నము
నకుఁ దానడువఁగలిగినంతదూరముబోయి యచట మారు
వేషంబున భోజనాదులజరుపుకొని యాసాయంత్రి నాలుగు
గడియలసమయమున నొకబ్రాహ్మణాగ్రహారము సేరెను.

ఇక్కడ రాజభటులు తిమ్మకునింటిపైఁబడి రాజాజ్ఞమై
నదీవలకురమ్మని బొబ్బలు వెట్టఁగా నింటనుండువారందఱు
ను భయముఁ జెంది తిమ్మకుఁడు చెప్పిన మాటలన్నియుఁ
జెప్పిరి. అపుడు వారు పోయి రాజునకు నవ్వార్తఁ దెలి
పిరి. రాజును వానికి మిక్కిలి కనలినవానిభంగి నటియించి
యీ తిమ్మకునుం బట్టి తెచ్చినవారికి విశేష బహుమాన
ముల నిచ్చెదనని ప్రకటింపుఁడని తన యితర మంత్రుల
కాజ్ఞనొసఁగె. నాటిదినముసభముగించెను. సభికులునుదిమ్మ
రుసు పారిపోవుటమంచిపనియే చేసెనని కొందఱును బారిపో
యి యెంతకాలముండఁగాఁగలఁడు. ఏదోవిధంబునఁ బ్రభుస

ముఖమునఁగాన్పించి క్షమాపణఁగోరిన బాగుండునని మఱి కొంచెమును ననుకొనుచుఁ దమయింటికిం బోయిరి

### తిమ్మరుసు ప్రచ్ఛన్న వర్తన.

అంతట తిమ్మరుసు తాఁబోయిన యగ్రహారమునకు భుక్తియగు గ్రామయజమానియగు బ్రాహ్మణునియింటికిఁబోయి యతనిని రహస్య ప్రదేశమునకుం దోడ్కొని చని తనకుఁ దటస్థించిన యాపదను నుడివి తనపేరు పైకి రాకుండునట్లుగాఁ గొన్ని దినము లాయూరివారు కాపాడినచోఁ దాను మఱియొక గ్రామమునకుఁ బిమ్మటఁ బోయెద ననియు, నట్లుగాఁదనను సామాన్యముగానున్న దినములను వెళ్ళించగలిగెనేని తిరుగఁదనయెడల రాయల కనుగ్రహముగలుగు ననియు నాలోపున తాను రాజకీయోద్యోగుల కంటబడెనేని రాజుకడకు వారు గొంపోయెద రనియుఁ దనకుఁ బ్రాణత్యాగము చేయవలసి వచ్చుననియు నంతవఱకు మీరు రక్షింపఁగలిగితేని యాయూరనుండెద ననియు లేనిచో నప్పుడే మఱియొక గ్రామమునకుఁ బోక ప్రాణత్యాగము సేసెదననియుఁ జెప్పె. ఇట్లుగాఁ బలుకుచున్న తిమ్మరుసు వాక్యంబులు విని యా బ్రాహ్మణుఁడు మిక్కిలిజాలినొంది స్వామీ యెట్టివారలకైన నిట్టి యిక్కట్టులొకప్పుడు తటస్థించును. అంతమాత్రమునఁ దమయట్టి ధీరులు వ్యాకులపడి ప్రాణపరిత్యాగమునకై

యిట్లుగాఁ బ్రయత్నించుట న్యాయమా? ఇచటి మేమం
దఱము మీవారము కామా. మేము నిత్యముఁ దినుచున్న
యన్నము మీరుపెట్టినది కాదా. మావిశ్వాస మెన్నిజన్మ
ములెత్తినదీరును! మీరెంతమాత్రమును భయపడవలసి
నదిలేదు. మాప్రాణములను ముందుగాఁ దీసుకొనినపిదప
రాయలుమీప్రాణములఁ దీసుకొనవలెను. కావునమీరు
స్వస్థచిత్తులై మాయింటనేయుండుఁడు మీకుసర్వోపచా
రములను మేమేచేసెదమని యాయనకొక రహస్యప్రదే
శముఁజూపి యుండాయనను బ్రవేశపెట్టి యాబ్రాహ్మణుఁ
డు తనబంధుమిత్రులకు వర్తమానంబుపంచి వారినిరావిం
చి వారితోనీక్రిందివిధంబున రహస్యంబుగఁ దెలుపనారం
భించె "అయ్యలారా! ప్రస్తుతకాలములో మనకుఁ గృ
ష్ణరాయలు ప్రభుఁడని చెప్పుకొనుట గల్గియున్ననాఁడెట్టి
వాఁడో మనమెఱిఁగియున్నవారము కామాగదా. అతని
ముద్రికఁజేఁబూని మనలనందఱఁ బాలింపుచున్నవాఁడత
నిమంత్రిశిఖామణియగు తిమ్మరుసేగదా తిమ్మరుసు పరిపా
లనలోనుండు ప్రజలకందఱకుఁ గలుగుచున్న సౌఖ్యమిం
తింతని వివరింపరానిదైయున్నది మనము నిత్యముదిను
చున్న యన్నమతనిదేగదా. అట్టివాని శ్రేయోభివృద్ధి మ
నమొక్కరమేగాక మనపిల్లలుగూడా దరతరములుగాఁగో

రవలసినవారైయున్నారుగదా. అట్టిమహానుభావునకిపుడొ
క యాపదతటస్థింపఁగా నతఁడురాజసన్నిధినివదలి మనమే
మో తనను సంరక్షించెదమనుతలంపుతో నతని పరిపాల
నలో వేలకొలఁది బ్రాహ్మణాగ్రహారము లుండఁగా వాని
నన్నిఁటినివదలి మనయగ్రహారమునకువచ్చి మనను శరణు
జొచ్చినాఁడు. అట్టివానిప్రాణములు కాపాడి మనయశస్సు
శాశ్వతముచేయవలయునుగదా. ఇంతకంటె మనకు సుస
మయము దొరకఁబోదుకావున మనమందఱు మిపుడు సం
ఘీభవించి యతనిజాడ యొరులకుఁ దెలియకయుండునట్లు
గా గాపాడవలయును." అనిన మాటల నాలకించి యా
బ్రాహ్మణోత్తములందఱు నుత్సాహముతో మనముబ్రది
కియుండఁగాఁ దిమ్మరుసునకొక యాపదరాఁగలదా. అట్లు
వచ్చెనేని మనప్రాణములనయిన నతని ప్రాణములకయి
ధారవోసి యతనిఁగాపాడుదము. అతనివార్త యెటుల
యిననెఱిఁగి రాయలువచ్చినచోనైన జంకక మనతపస్సు
లన్నియు ధారయైనఁబోసి యితనిరక్షించెదముగాక. ఇం
తనుండితిమ్మరుసునునిర్భయముగనుండుమని చెప్పఁడ యు
నట్లుగాఁ జేయుటకుఁ దప్పినవాఁడుతమతమ గురువులపాద
ములకుఁదప్పినట్లొట్టుబెట్టుకొనియెదమనినిశ్చయించి పలికితి
మ్మరుసిచ్చోనున్నంతకాల మహర్నిశములిందఱు బ్రాహ్మణు

లతఁడున్న యింటిచుట్టును నిల్చియుండి కాపాడవలసినదని నిర్ణయించుకొని తమతమ గృహంబులకుంజనిరి. అదిమొదలు నిత్యమును బ్రాహ్మణు లందఱు నతని రహస్యంబు గాపాడుచు నతనికిఁ బురాణగోష్టి మొదలగువానిం జరుపుచు దినములుగడిపిరి. ఇట్లుండ నొకపక్షంబయ్యె. అటుపిమ్మట తిమ్మరుసాగ్రామము వదలి మరియొకచోటికిఁబోనుద్యోగించి యా బ్రాహ్మణులలో ముఖ్యులఁబిలిపించి మీదయవలన నొకపక్షంబిక్కడ నిర్భయంబుగా జరిపినాడను. ఒక్కస్థలములోఁ జిరకాలముండుటంజేసి దానివలనఁ గొన్ని యాపదలు రాఁగలవు. కావున మీయాజ్ఞనంది నేను మరియొకతావునకుఁబోయి యీ నాయజ్ఞాతవాసకాలంబు గడిపెదను. దయచేసి నాకు సెలవొసంగుఁడని ప్రార్థించె. అట్టిదానికి వారు సమ్మతింపక మీరెన్ని దినంబులున్న మాకేమి బాధకమున్నది. మేము మిమ్ము సంరక్షింపలేకున్న మీరు మరియొకచోటికిఁబోవచ్చునుగాని యటుగానిచో మీరు వేగిరింపనేల యని యాటంకములు చెప్పినదానికెంతయుఁ దిమ్మరుసు సంతసించి వారిని మంచిమాటలచేత నొప్పించి వారివలన ననుజ్ఞాతుండై యాయూరువదలెను.

### తిమ్మరుసు క్షత్రియులకడ డాగుట

అంతటఁ దిమ్మరుసు బ్రాహ్మణాగ్రహారము వదలి దానికిఁ

గొంతదూరములోనున్న యొకక్షత్రియ నివాసస్థానమును గ్రామమునకుంబోయి యచ్చోనున్న యజమానింగలుసుకొని తనకుగలిగినయాపద వెనుకను బ్రాహ్మణులతోఁ జెప్పినట్లెజెప్పి తనమానప్రాణములను గాపాడఁగోరినాడవనుడు గ్రామయజమానుఁడుయెంత పనిజరిగినదని కొంతసేపు నొచ్చుకొని అయిననేమాయె మీరునిర్భయముగా నుండుఁడు. నేనొక్కఁడనేమిము సంరక్షించెదను. మీరున్నస్థలముచుట్టును నమ్మకమయిన రాజకుమారులతో నాయుధపాణులమై వచ్చిసంరక్షించెదము. మాజీవముండఁగా మీప్రాణమునకొక భయములేదు. అనంతరము చూచు కొనెదముగాక. అనియభయంబొసంగి యాక్షత్రియోత్తముండు తనబంధులలోనుంచి బలపరాక్రమములుగలవారిఁగొందరినెంచి యతనిచుట్టునుంచి కంటికి రెప్పవలెఁ గాపాడుచుండుఁడని నియమించి తిమ్మరుసునికొక్క రహస్యస్థలంబుఁజూపి భోజనాదిసమపాయములకుఁ దగిన యేర్పాటులుజేసి యతిగౌరవముతోఁగాపాడుచుండె. ఇట్లుండ నొకపక్షంబయ్యె. అంతటఁదిమ్మరుసు వారివర్తన కెంతయు సంతసించి వారివలన ననుజ్ఞాతుండై బయలుదేరియొకవైశ్యనివాసగ్రామంబునకుఁ బోయి వారితోఁగూడఁ దనవృత్తాంతమెఱింగించి వారివలనఁగూడ నొకపక్షము వరకును

సంరక్షింపఁబడి వారివర్తనకుంగూడ సమ్మతించి యాటనుం
డి బయలువెడలి నాలవజాతివారిలోఁ గృషికులుండు గ్రా
మమునకుఁబోయెను

### కృషికులఁ బరీక్షించుట.

అక్కడను దిమ్మరుసెప్పటి యట్లాగ్రామపెత్తనదారు
నొకనిం గలసుకొని తన దైన్యస్థితిని విస్తరించిచెప్పె. ఆ
మాటలువిని యా పెత్తనదారుఁడు రాజాజ్ఞానుసారముగా
బ్రకటింపఁబడిన వృత్తాంతము విని యున్నవాఁడు గావున
నీమంత్రిం బట్టి రాజునకొప్పించినచో దమయెడల రాజు
మిగుల విశ్వాసవంతుఁడై యుండగలడని యోచించి స్వా
మీ నేనొక్కఁడనే యీగ్రామమునకుఁ బెద్దను కానుగదా.
ఇంకను మావారలలోఁ బెద్దలున్నారు. వారింగూడ నీ
కార్యములో సహాయపడుటకు గోరవలసియున్నది. వారి
తో దీనిం దెల్పివచ్చెదను. దయచేసి యిచటనే యుండుం
డని పోయి వారివారిలో ముఖ్యులుగా నుండువారిం గలు
సుకొని యీవృత్తాంతంబంతయు దెలిపె. ఆమాటలు విని
నతోడనే వారందఱు నేకగ్రీవముగా నీతని మనమెటుల
నైన రాజునకు జూపితిమేని మనయెడల రాజునకెంతవిశ్వా
సమైన కలుగగలదు. ఇదియునుగాక తిమ్మరుసు రాజునొ
ద్ద తాను చాలియున్నానని విజ్ఞప్తిగి మన కష్టసుఖముల

నాలోచింపక మనల నెన్నిబాధలు పెట్టెను ఆమాటల న
తఁడు మఱచిన మనము మఱువవలసినవికావు. మనను శి
క్షించునపుడు రాజనీతి యట్లున్నదికావున దాఁజేయవలసి
నది లేదని చెప్పఁగాఁ దాను దోషియైనపుడుమాత్రము రా
నీతి యెందుకుతోఁచినదికాదో తెలియదు. కాఁబట్టి యిత
నినెట్లయిన మోసముచేసి మనమిక్కడనుంచి రాజునకుఁ దె
లియఁజేయుటయో లేకున్న నితనిం దోడ్కొనిపోయి రా
జున కెదుటఁబెట్టుటయో చేయవలయును. ఇతనికిమాత్ర
ము మనమిపుడు విడువఁగూడదు. బుద్ధిమంతులేదో యీ
కత్రోవఁ ద్రొక్కవలెను నీతనిని మనయూరనే యుంచు
దమని నిశ్చయించుకొని వారిలోఁగొందఱతనియొద్దకు వ
చ్చి మీకేమిభయములేదు. మిమ్ము బహుజాగ్రతగా మే
ము సంరక్షించి మీకు గావలసియున్న పనినంతయుదీర్చె
దము. తిరుగ మిమ్ము రాయలతో గలిపి యాసంతోషము
గూడ మేమేపొందెదము. అని తిమ్మరుసునకు భయము తీ
ర్చి రాజానుగ్రహము మీయెడ గొంచెముదినములలోనే
రాగలదు. అంతవఱకును మీరీగ్రామములోనే యుండి
కాలము గడుపుడని యతనిం దోడ్కొని వారొక బ్రాహ్మ
ణగృహమునకుఁ బోయి యచ్చోట నతని విడియించి భోజన
సదుపాయంబుజేసి యతఁడేరాత్రి లేచిపోవునో యను భ

యములతో నతని చుట్టును దగువారలఁ గాపుంచి యతనిని
రాజుకడ కెట్లు తోడుకొనిపోయిన బాగుండునను యోచన
లోనుండిరి. ఇటులుండ నొకవారముదినములు గతించెను
పై యాలోచనజేయుచున్న పెద్దలలోఁ గొందఱు కొన్ని
యాలోచనలం జెప్పిరి. వానిం దిరస్కరించు మఱికొన్నిఁటిని
మఱి కొందఱు దెల్పిరి. అందుఁ గొందఱు బుద్ధిశాలురు
పైయుపాయములు లెస్సగా లేవనియు నేయుపాయంబై
న జేసి తిమ్మకుసును రాజసమ్ముఖమ్మునకుఁ దోడ్కొని పోవు
టయే పౌరుషకార్యంబనియు దానికిఁగా నొకయుపాయ
ముతోచెనని చెప్పి యద్దాని నీక్రిందివిధంబున వ్యక్తీకరిం
చిరి. "వినుఁడు మనము తిమ్మకుసుం గాంచి యయ్యా
మీరీగ్రామమునకు వచ్చినవార్త యెటులనో గ్రామస్థు
లలో నశేషజనంబునకుఁ దెలిసినది. ఇటుపై నీవిధంబునఁ
గాపాడుట దుష్కరము మీరంగీకరించిన మీసంరక్షణ
కొక యుపాయంబు జేసెదము. లేనిచో మమ్మును నెపపె
ట్టవలసిన పనియుండదు. అని యతని నీయూరినుండి మ
ఱియొక యూరికిం దోడ్కొనిపోయెదమని తెల్పి దానికిఁ
గానతని నొకబోషాణపుఁ బెట్టెలోఁగూర్చుండఁబెట్టి దాని
నొకబండిపయినుంచి రాత్రికిరాత్రి మఱియొకగ్రామమున
కుఁ గొనిపోయెదమని చెప్పి యాబండి తెల్లవారువఱకు

రాయల ముఖ్యపట్టణంబునకు దీసుకొనిపోయి రాయలకీ వార్తనెఱింగించి యతనియెదుటనే దానిన్విచ్చి రాజునకు తలంజూపుదము. అటుపిమ్మట జరగవలసినకార్యము ప్రభుండే జాగ్రతపెట్టగలండు. ఇదియే నిర్బాధకమగు నుపాయము. ఇంతకంటె మంచియుపాయంబు మఱిలేదు. దీని నెవ్వరైనఁ బూర్వపక్షముఁ జేయఁగల్గెదరేని యట్లుచేసి యింతకంటెను మంచియుపాయంబు దెలుపుడనుడు వారందఱు దానికి సంతసించి యదియే కర్తవ్యమనిరి ఆ వెంటనే వారిలోఁగొందఱు తిమ్మరుసుకడకుంజని తామేర్పరుచుకొన్న నవీనమార్గమును, దమకుగలభయమునుఁ దెల్పి యీపనికి మీరుసమ్మతింపనిచో మమ్ము నెపపెట్టఁబనిలేదని నుడివిరి. తిమ్మరుసు తన యంతరంగంబున దాఁదొల్లియూహించినట్లే కార్యము నడచుచున్నందుల కెంతయుసంతసించి యోయన్నలారా! నేను మిమ్ము నమ్మి నా మానప్రాణంబులు మీచేత నుంచినాడను. మీరునన్ను నీళ్ళ ముంచినను మంచిదే పాలముంచినను మంచిదే మీకంటెనాకుఁ బ్రస్తుతములో సంరక్షకులు లేరనిగదా యిక్కడకువచ్చినాడను. అట్టిస్థితిలో నన్ను సంరక్షించుటకు మీరేయుపాయమాలోచించిన నదినాకుసమ్మతమే. మీరెక్కడ నెటులుండుమనిన నటులనేజరిగించువాఁడను.

మీయిష్టానుసారము కార్యమునడపుడనుడువారునుసమ్మ
తించిరి. ఆరాత్రి పెందలకడ తిమ్మకునకుభోజనము బెట్టిం
చియొకబండికి బలమైనగిత్తలనుబూన్పించి దానిపై నొక
పెద్దమందసమునుబెట్టి దానిలోనతనకొక పరుపమర్చి యుం
చాతనింబరుండఁబెట్టి తగుజనములగూడ నుంచియాఱునాడు
సూర్యోదయ సమయమున కాసగొందిపురంబున కాబం
డిఁదోలిరి. ఇట్లు తోలితెచ్చినవారిలో బెద్దయగు కాపు
కృష్ణదేవరాయనికడకుఁజని "స్వామి ద్రోహపుబండి" వచ్చి
నది. ఏలిక న్యాయముగఁ జిత్తగించవలసినదని ప్రార్థించె
ఆమాటలువినినతోడనే యందేదో విశేషముండునని యూ
హించియటులైననాబండినిటకుం దోలితెండని యాజ్ఞయొ
సంగ పిదపనాబండిఁదోడ్కొనివచ్చి యాకృషికులురాజస
న్నిధినిల్పి పెట్టెతలుపువిచ్చి దానిలోపలనతిసుఖముగానిదు
రించుచున్న తిమ్మకునునులేపి స్వామీ! మీకుదిగవలసిన స్థ
లమునకు వచ్చినారము. ఈపాటి బండిదిగి దంతధావనాది
కృత్యములు జరిపిననిక్కడనేకొంత కాలము సుఖంబుగనుం
డవచ్చునని తెల్పిన విని తిమ్మకుసు కన్నులు నులుపుకొనుచు
బండిలోనున్న పెట్టెలోపలనే లేచినిలువఁబడియె అట్టి తి
మ్మకునుంజూచి కృష్ణరాయలును గృష్ణరాయలంజూచి తి
మ్మకునును నద్భుతంపడి యిదేమి! యిదేమి! యనిపలుకం

దొడంగిరి. అప్పుడుతిమ్మరుసు బండి దిగివచ్చినతోడనే రా యుండాతనికి దండప్రణామంబు లాచరించి కౌఁగలించుకొ ని యతని క్షేమసమాచారంబు లరయుందొడంగ తిమ్మరు సు రాజునుమరల గాఁగలించుకొని నాక్షేమసమాచారము లేలికకుఁ జెప్పకనే బోధయగుచున్నవి. నేనువెనుకమేలిక తో మనవిచేసియున్న కార్యసానుకూలముతోనే సర్వము క్షేమమని స్పష్టముకాగలదు. అని తెల్పితానుబయలుదేరిన దినముమొదలుకొని తానెక్కడెక్క డెన్నెసిరోజులున్నది యు, నెవ్వరెట్లుగా దనసంరక్షించినదియుఁ, నుదికెప్పు డుతాను కృషికుల గ్రామమునకుఁ బోయినదియు, నచ్చో వారుచేసిన మోసకృత్యమును సకృచ్ఛమునువివరించి చె ప్పె. అట్టితిమ్మరుసు వాక్యములకు రాయండెంతయు సంత సించి తనసంశయనివారణకుఁగా నతఁడట్టి దేహాయాసపడి నందుల కెంతయు వగచి మీసిద్ధాంతంబులు శిలాంకురంబు లు. వానింబరీక్షింప మాబోఁటులు యత్నించుట మహా పచారము. కావున నన్నుక్షమియించి యిటుపై నిట్టి శ్ర మ పడవలదని చెప్పి యిట్టి యవిశ్వాసకార్య మొనరించి న యీకృషీవలుల నెట్లు గారవించవలయునని యడుగఁగా డిమ్మరుసు నవ్వి వారికి మాయూళ్ళును, భత్యములు, య థాప్రకార మిప్పించి వాటితోపాటుగ వారికిసామిద్రోహ

వుబండిదోలినవారని యొక బిరుదాంకము దయచేసినచో వారికిని, వారిమార్గము నిఁకముం దవలంబించు వారికి నిఁగూడ బుద్ధి రాఁగలదనివిన్నవించిన రాయలట్టివాక్యములకెంతయును నలరి యాకృషీకులదిక్కు మొగంబై మీరందఱుఁ దిమ్మరుసుచెప్పుచున్న మాటలు బాగుగ వినుచున్నారుగదా! అతని కాగ్రహము రాకుండుటంజేసి మీరుచేసిన ద్రోహకార్యమును క్షమించి మిమ్మును దిరుగఁ బ్రాణంబులతో వదలుచున్నాము. లేనిచో నిచటనే మిమ్ము బందీకృతులం జేయవలసియుండు. ఇంతటి నుండియైన మీరు బుద్ధిగల్గి కాలము గడపుఁడు. లేనియెడల నతనికోఱకు మీవలననుద్దేశింపబడిన కార్యములు మీకోఱకే జరుగగలవు పొండుపొండనుఁడు నాకృషీవలులు లజ్జావనతవదనులై మాఱుమాటాడనేరక తమ్ముందామె దూషించుకొనుచు దమయూరికివచ్చి చేరిరని యొకకథ లోకములోవ్యాప్తమైయున్నది. దీనింబట్టి కృషీవలులందఱు నిట్టివారేయని నిశ్చయింపఁగూడదు. తదన్యశాఖలవారిలోని మోసములేదనియు నూహింపఁగూడదు. లోకములోనొక జాతిలోనివారు పెక్కండ్రేదియైననొక కార్యముం జేసెదరేని యది సంఘకార్యమగుంగావున దానివలన గలుగు ప్రతిష్టాప్రతిష్టలు వారికేకాక వారిశాఖవారందఱకింగా

డఁ జెంది శాశ్వతమగు కీర్తియు, నపకీర్తియుఁ, దెచ్చును. కావున నపకీర్తికార్యము జేయునపు డేసంఘమువారును భయపడి దానిం దొలఁగించు నుపాయములనే చేయవల యును గాని లాభాధిక్యమున్న నెన్నటికిం జేయఁగూడదు. ఈ కథ మొత్తమునను దీనివలన గలుగు ఫలితార్థమిదియే.

### తిమ్మరుసు కుమారుని చేష్టలు.

తిమ్మరుసునకొక కుమారుఁడు గలఁడు అతఁడు యౌవన ప్రాదుర్భావ సమయమున శృంగారశేఖరుండై తదనుకూ ల నాయికల రంజించుటకు యత్నింపుచుఁ దదంగనుగ సుగంధ పుష్పముల సంపాదింపఁ దన పరిచారికలఁ బంపు చుండును. వారలు తెచ్చియిచ్చు పుష్పాదికముఁ దనయుద్దే శానుసారముగ నుండకుండుటం జేసి రాజుయొక్క శృంగా రవనంబులోని కొన్ని యెన్నిక పుష్పంబులు తెమ్మని పరిచా రికల కాజ్ఞయొసంగె. వారుపోయి యత్నించి యవి ప్ర త్యేకము రాజునకేగాక నన్యులకు లభింపవని వనపాలురు జెప్పిన వర్తమానంబు విని తిమ్మరుసు పుత్రుఁడు కోపించి యట్లైన రాజుమాత్రమే పాటి వానినుపయోగింపఁగలఁ డో చూచెదమని వారికిఁ జెప్పి యాప్రయత్నంబు వదలు టకుఁ దనభృత్యుల కాజ్ఞయొసంగ తానుమాత్రమెట్లై న నాపుష్పములు సంగ్రహించి రాజునకు దొరకకయుండు

నట్లు చేయఁదలంచి పాటచ్చరుండై వానినన్నిటి నపహ
రించుచుండె. రాయలు తనయుద్యానవనమునుండి మంచి
మంచిపుష్పములు రాకుండుటఁగని యుద్యానపాలుర లోప
మని వారినిదండించుట కాజ్ఞయొసంగ, వారును జేయు
నదిలేక నవి నిత్యముంబూయుట తాము చూచుచుండుట
నియు నవి ముచ్చిలింపఁబడు చుండెననియు నాదొంగను
బట్టి రాజసన్నిధిలో నొప్పగించెదమనియు దానికిఁ దమ
కుఁ గొన్ని దినముల వఱకు నవకాశమీయవలయునని రా
జపురుషులఁ బ్రార్థించి వారి యనుమతిని బహుజాగరూకు
లై యొకటిరెండుదినంబులు రాత్రింబవలులు వేచి తుద
కు దొంగను పుష్పములతో బట్టుకొనిరి. ఇట్లుగా దొం
గదొరికెనని సంతసించి రాజపురుషులకుం దెల్పిన వారు
వచ్చిచూచి యతఁడు తిమ్మరుసు పుత్రుఁడగుటకుఁ జింతించి
తాము దండించుటకంటె నతని రాజసన్నిధిం గొంపోయి
నఁ దమబాధ తొలఁగునని యా వనపాలురతో నాతని
రాయలకడకుంగొంపోవ నాజ్ఞయొసఁగె వారు నాతని పు
ష్పములతో నొకబండిపయిం గూర్చుండబెట్టి రాజమార్గ
మునఁ దెచ్చుచుండిరి. ఇంతలోఁ దిమ్మరుసున కవ్వార్తఁ దెలి
సిన నతఁడును వీథిగుమ్మమున నిలిచి తానద్దానిం దెలియని
వానివలెఁ జూచుచు నందుండుదొంగయెవఁడనుచు నతనితు

మాన్యంజేయుని వనపాలురు దెల్పిరి. ఆమాటలు వినినతో
డనే తిమ్మరుసుకుమారుఁడు తనయుత్తరీయముఁదీసి మొగ
ముఁగప్పుకొనియె. తిమ్మరుసు మిక్కిలి కోపంబభినయింపు
చు గుమారుని నిందింపుచు నోరున్నఁ దలగాచు నన్నట్లు
గా నధికారిపుత్రుఁడనని గర్వించియిట్టి లోపపుగార్యము
లు జేసిన నూరకపోవునా, యొకపరి బుద్ధిజెప్పినంగాని వీని
దుర్మార్గంబు మానదు. వీనిం దీసుకొనిపోయి రాజున కొ
ప్పింపుడు. అని యాజ్ఞయొసంగి యింటిలోనికిం బోయె.
మంత్రిపుత్రుఁడును తనతండ్రిజెప్పిన మాటలోని రహస్య
ముం గనిపెట్టి తనయొద్దనున్న పుష్పంబు లొకటొకటిగా
భక్షింప నారంభించె. రాజద్వారంబు జేరుసరికిఁ దనకడను
న్న పుష్పంబుల భక్షించి మెల్లన నిర్భయంబుగనుండ నం
తట వనపాలురు పోయి పుష్పముల దొంగిలించిన వానినిఁ
బుష్పసహితంబుగాఁ బట్టితెచ్చినారమనుడు రాజాతని పై
కిదీయుండనుడు నామంత్రిపుత్రు నెదుటనిలిపిరి. ఇతఁడు
పుష్పముల దొంగిలించెనని మేము నమ్మనుడు వనపాలు
రతని బుష్పసహితంబుగాఁ బట్టితెచ్చినారమనిరి. ఏవి పు
ష్పంబులనుడు మంత్రిపుత్రుం డూరకుండె. అపుడు వన
పాలురతనిమొలనున్న పుష్పములకొఱకు బరిశీలింపఁగా
నొక్కటియును గానరాదయ్యెను. అట్టిదానికి దిగులొంది

వారందరును బండిలోపలను మార్గమధ్యమునను వెనుక నారంభించిరి ఎచ్చోటనైనను పుష్పముల జాడనైనగానక తెలతెలఁబోవుచుఁ దమకేమి కీడు మూడునోయను భయముతో నిలువంబడియుండిరి. అపుడు రాయలు వనపాలకులయెడఁగినిసి మంత్రిపుత్రుండను మాటయైన నాలోచింపక నతని నేలనాకడకుఁ దోడి తెచ్చితిరి. ఇఁకముందిట్టి కార్యంబులెన్నటికిం జేయఁదగదనియు నట్లుగాఁ జేసినచో దండించెదమని చెప్పి మంత్రిపుత్రుని ననునయించి యింటికిఁ బొమ్మని పనిచె. అట్లుగా నింటికి వచ్చియున్న పుత్రునిం జూచి తిమ్మరుసు గడచిన వృత్తాంతంబంతయు నెఱింగి యట్టి కార్యంబులెన్నటికిం జేయక యుండవలయునని యాజ్ఞాపించి లోలోపల మందలించె.

## తిమ్మరుసునకు దుర్దినములు వచ్చుట.

ఇతఁడు కృష్ణరాయలకడనుండి యనేక సమయములలో దనబుద్ధిబలంబు జూపుచు గాలంబు గడుపుచుండఁగా నొకనాడు రాయలతనిం దోడ్కొని యేనుఁగుపై వాహ్యాళిపోవుచుండెను. అట్టియెడ నాయేనుగొక చింతక్రిందుగాఁబోవుచుండె. ఆచెట్టు ఆవరలో విశేషముగాఁ బూసి కన్నుల పండువుగా గానుపించె. దానిం జూచి రాజు ప్రశంసించుచుండఁగా దిమ్మరుసు దానికనుగుణ్యములగు వాక్యములు చెప్పుచుం

డెనుగాని యతనిమనస్సంతయు నాచింతపుపువ్వునుగని సెలవుమా
టయందే యుద్దేశించుచుండె. అట్టికోర్కెమిక్కిలిప్రయా
సంబుపైఁ దప్పించుకొని యింటికివచ్చి తనకు రాజసన్నిధిలో
నుండఁగ బుట్టినతక్కువయుద్దేశమున కెంతయు జింతింపనా
రంభించె అహా నేనిట్టిమహోన్నతపదవిలో నుండఁగా
నాకిట్టియల్పబుద్ధియేల పుట్టెను. ఇదిదినములసామాన్యము
చేత బుట్టినబుద్ధియై యుండకతప్పదు. దుర్యోగంబెద్దియో
సన్నిహితంబై యున్నది. ముందే మనము జాగరూకతతో
నుండుటకర్తవ్యము. అని నిశ్చయించుకొని తనభార్యతో
నావృత్తాంతమంతయుం దెల్పి మనము మనకుగలధనధాన్యం
బులన్నిఁటినిఁ జేతిఖర్చుగా దానధర్మంబులు చేసికొని మ
నపిల్లల మేనమామలయింటికిబంపి మనము దేశాంతరముల
కుబోయి యాదుర్దశాదినంబులు వెడలబుచ్చెదమనుఁడునా
సాధ్వియు దాని కంగీకరించెను. ఆ వెంటనే యామంత్రిశి
ఖామణి తనబిడ్డలవారిమాతామహస్థలంబునకుఁ బంపియా
పూటనే తనయింట బ్రాహ్మణసమారాధనమని పత్రమా
నంబుఁజేసి వారలకు వంటలు మొదలగునవి చేయించి వారికి
హస్తోదకములిచ్చుచు నాయనలారా! నేనొకవ్రతంబుద్యా
పనజేసినాను. అందులో నాయింటనుండు వస్తువులలో నెవ్వ
రెట్లు తీసుకొనిపోయిన నేనేమియుననగూడదు. మీరుసుఖ

ముగభుజియించి మీమీశక్తికనుకూలమైనంత ధనముగా
ని, వస్తువాహనంబులుగాని యొకరితోనొకరు పోరాడకుం
డవింటికిబట్టుకొని పోగోరుచున్నాను. అట్టిమీకార్యమున
నెవ్వరు నడ్డగించుకొనరు నేటిసూర్యాస్తమయమైనపిమ్మట
మీరేమిగొంపోయిన నదిచెల్లనేరదు. కావునమీకిష్టమైన
పదార్థముల నాలోపుననే బట్టించుకొనుడని తెల్పినవా
రందఱు నత్యంతానందంబున భోజనము లతిత్వరితముగఁ
గావించుచుండిరి. అపుడు తిమ్మరుసుతనభార్యంజూచి మన
ము దేవతాదర్శనమునకై పోవుటకిదేసమయమని కట్టుబట్ట
లతో నిలుబైలువెడలి యుత్తరాభిముఖులై నలదమయం
తులవలె దండకారణ్యంబులోఁ బ్రవేశించి నడువనారంభిం
చిరి. బ్రాహ్మణబృందంబును భోజనానంతరము ముంనుధ
నాగారంబులకుఁబోయి యచ్చోనుండు ధనరాసులగంపల
కొలఁది సంగ్రహించుకొని యటనుండి యుండిన పదార్థం
బంతయుకదిపి బయటబెట్టుకొనుచు సాయంసమయమున
కాయింటనొక్క పరికరమయినలేకుండఁ జూరఁగొని యతి
సంతోషంబుతోఁ దమగృహంబులకువచ్చి చేరి తిమ్మరుసు
మహౌదార్యంబుకర్ణునింగూడ నతిక్రమించెనని యనేకస్తో
త్రపాఠంబులు చేయుచుండిరి. తక్కినతిమ్మరుసు సంబంధు

లగువారందఱు సతనియాజ్ఞానుసారంబుగఁ దమతమనెలవు
లకుంబోయిరి.

## ఇతరమంత్రులకుట్ర.

నాటిరేయి రాయలయాస్థానములో నుండెడు తక్కుంగ
లమంత్రులలోఁ గొందఱు తిమ్మరుసు చేసిన మహాదార్యకా
ర్యంబువిని యసూయాపరులయి యొకచోటికిం జేరి యీ
క్రిందివిధంబున యోచింపనారంభించిరి. వింటిరా తిమ్మరుసు
మంత్రివృత్తాంతము. ఇతఁడు రాజునకుఁ దనయెడగౌరవము
గలదను ధైర్యముతో నెంతలేసి కార్యములు చేయుచున్నా
డు! ఇతఁడు దివాణముసొమ్మునకును దనసొమ్మునకు భేదమిం
తయైనచూచుటలేదు. ఇతనిని లెక్కపత్రములడుగుటకు రా
జుమిక్కిలి వెరచుచుండు. కాకులనుగొట్టి గద్దలకు వేయున
ట్లుగా రాజుసొమ్ముహరించి ధర్మకార్యములు జేయుచున్నా
డు. ఈవృత్తాంతమెట్టులయిన రాజునకుఁ దెలిపి యీసమయ
ములో నతనియెడ కలకబుట్టింపవలయును. అని నిశ్చయిం
చివారందఱు నారాత్రి రాజసన్నిధికిఁ బోయి తొందరతో ను
క వార్తవిన్నవించుటకుఁ గొందఱుమంత్రులువచ్చి హజా
రమున వేచియున్నారని రాయలకు వర్తమానంబుఁబం
పిరి. అట్టివాక్యంబులు వినిరాయలు వారికప్పుడేదర్శనం
బొసంగి వారిరాకకుఁగతంబడిగెను. అప్పుడు వారందఱు నేక

గ్రీవముగా నిట్లనివిన్నవించిరి ఏలిక మాయట్టిమంత్రులనుః మ్రిజరుగుచుండెడు వర్తమానములనరయుటకై పాఱిలుమాలియుండెదరు. ఆకారణమునఁగొందఱు మర్యాదనిలుపుకొనుటకై యత్నించెదరు. మఱికొందఱు సమయము దొరికెనని తమతమకార్యములు చక్కఁబెట్టుకొనియెదరు. అట్లని ఆమార్గమున నార్జించినవిత్తము దామనుభవించినఁ దమ బంధుమిత్రులకిచ్చినఁ గొంత ఫలముండును ఏలికను మోసముచేసి సొమ్మునార్జించి యది ధర్మముచేసి ధర్మాత్ములమని లోకములోఁ బేరును సంపాదింపవలెననుట నీతిబాహ్యకార్యముగదా! ఏలిక తిమ్మరసునెడ మాపుం విశ్వాసమతని ప్రవర్తనమువలన స్పష్టము కావలసియుండును. అతఁడు నేటిదినము తనయిల్లు బ్రాహ్మణులకుఁ బారవిడిచెను. ఏలిక సొమ్ముఁ తానుగుడువలేదు తనవారలకుఁ బెట్టలేదు నిష్కారణము తనసొమ్ముగాదను తలంపునఁ గాకున్న నిట్టిపని నెవరైనఁ జేయుదురా? ఇప్పటిలో బరిక్షించిన నతనిసంపాద్య మెంతయున్నదో యేలికచిత్తమునకు విశదముకాఁగలదు. ఈధనమంతయు నతనిన్యాయార్జితమేనని చెప్పవచ్చునా! కాదన్యాయార్జితమే కానిండు. దీనికిఁ బ్రభువులోకరేమి? దీనిని వినియోగించిన ప్రతిష్ఠయుతనికేమి! ఇట్లుస్పష్టములయిన సమయములోనైన నే

లికఁగొంచెము పరిశీలింపనిచో నీకె రాజపురుషులును, ప్రజలును ప్రభువులఁదోచుకొనరా? కావున నేలిక యొకపరిదీనింబరిశీలింపఁ బ్రార్థించెదమని పల్కిరి. అట్టిమాత్రి జనులమాటలనాలించి రాయఁడెంతబుద్ధిశాలియయినను దిమ్మరుసునెడ నెట్టివిశ్వాసగౌరవము లుండినను ధనవిషయికమగు వృత్తాంతంబుగావున నద్దాని బరిశీలించిన దనకా సొమ్ము తిరిగి లభియింపఁ గలదను నాశతోఁ దిమ్మరుసునెడ నాగ్రహించి తనభటులఁబిలుపించి తిమ్మరుసునింట నేటి దినమున జరిగిన ధర్మమెంతవఱకున్నదో విచారించి వర్తమానము తెల్పుఁడనిపంచె. ఇట్లుపంచియునంతటితోఁ గోపంబు చల్లారక తిమ్మరుసుంగూడ నెట్లున్నవానినట్లుగా మాసన్నిధికిఁదెచ్చిపెట్టుమని దండనాథుని కాజ్ఞయొసంగె. దానికావచ్చియున్న మంత్రులు తమయంత్రంబుపారెనని మిగులసంతోసించియుండిరి.

తిమ్మరుసు గృహంబునకుఁ బోయినరాజభటులువచ్చి తిమ్మరుసునేటిదినము సెలవుచేసినధనంబు లక్షలకొలఁది యున్నదనినుడివిరి. మఱికొంతవడికి దండనాథుండువచ్చి దేవరయాజ్ఞానుసారంబుగ నేనేతిమ్మరుసుం బట్టి తెచ్చుటకుం బోయియుంటిని. అతఁడెచ్చోటను గాన్పించలేదు. ఎచటనో కను మొఱంగియున్నట్లుతోఁచెడిని. సెలవేని వెదకించి పట్టి తే

చ్చెదననియె· కృష్ణరాయుండంతట నాస్థానంబు చాలించి కర్తవ్యము నాలోచించి యాజ్ఞాపించెదమనిచెప్పి నిజమందిరంబునకుంజనియె· ఇట్లుండగొన్ని దినంబులు జరిగెను·

## తిమ్మరుసుయాత్రావిశేషములు.

అట తిమ్మరుసు భార్యాసహితుండై పెక్కుదేశములు ద్రిమ్మరి తనచేతనున్న భత్యమునంతయు వెచ్చించిధనసహాయము లభింపకుండుటచేత ననేకచిక్కులుబడుచు తన భార్యయొంటనున్న కొన్ని వస్తువులమ్మి దానివలనఁగొన్నిదినములు కాలక్షేపముఁ జేయుచు నొకపూట తినినట్లును మూఁడుపూట లుపవాసముచేసినట్లుగా మానప్రాణంబులుసంరక్షించుకొనుచుఁ దనకష్టదినంబులన్నిఁట వెళ్ళించుచుండె. ఇట్లుండఁగా నొకయూరా భార్యాభర్త లిరువురును జేరిరి. ఆయూరొకక్షుద్రగ్రామముగుటం జేసియు నీ యిర్వురుఁ గాలాతీతమయినపిమ్మట నాగ్రామములోఁ బ్రవేశించుటచేతను నెంతయుత్నించిన నాయిర్వురకుం జాలినంతభోజనసామగ్రియైన లభింపదాయెను. అట్టియవస్థకెంతయుం జింతించి డబ్బునకు డబ్బెక్కు విచ్చెదనని యొక యంగడికిఁబోయి యాయంగడివాఁడు మధ్యాహ్నము భోజనము జేసి వచ్చువరకునట గన్పెట్టుకొని యుండఁగా వాఁడు వచ్చితనకడ రసవర్గములు నిండుకొనియెననియు నామరునా

డే సమీపగ్రామములో సంతయగుటంజేసి యాదినమునసే
దనకడవస్తుసామగ్రి దొరకదనియు వలయునేని గోనెయు
డుగు బియ్యపునూకలేమయిననున్నిచ్చెదనని చెప్పఁగా
దానికేసంతసించి తిమ్మరుసువానిందెమ్మని చెప్పెను అపు
డు వాఁడతిశ్రమచేసి గోనెలన్నియుమలిపి యొక యర్ధసే
రునూకలతనికిచ్చెను. దానికేసంతసించి దానికిఁగాఁ దా
ననుకొనినవిధముగా డబ్బిచ్చి దానికిసరిపడునట్లు కొంచె
ముప్పును, చింతపండునుగైకొని యేమిలేకున్న నీరెంటి
సహాయంబున నేటిదినంబు గడుపవచ్చునని బైలుదేరి వ
చ్చి భార్యకు వానినొప్పగించి తానుజెరువునకుఁబోయి స్నా
నముచేసివచ్చెదనని చెప్పిపోయెను. అతనిభార్యయు నా
వఱకే భోజనకాలాతిక్రమణమగుటచే ద్వరలో నత్తిసరు
పెట్టి పచనంబయినపిమ్మట సమీపంబుననున్న బావికడకుం
బోయి యుదకమునుదోడుచుండెను. ఇంతలోఁ దిమ్మరుసు
స్నానముచేసి యాహ్నికంబుదీర్చి విస్తరివరచుకొని భోజ
నసన్నాహముజేయుచుండెను. అతనిభార్యయు ద్వరలో
వచ్చి యత్తిసరుగిన్నె యెదుటనుంచి వడ్డనజేయుచో నం
దొకబల్లిపడి చచ్చియుండుటఁగానుపించె, దానింజూచి తి
మ్మరుసుభార్య కన్నీరునించుచు మనకుఁబట్టినశనియింకను
వదులునట్లులేదు. నేటిదినంబున బియ్యమయిన దొరుక

ని కుగ్రామములోనికి వచ్చినట్లుగానే దొరికినపదార్థముల నైన దినదినియ్యక మానూటనున్నశని యిన్ని బాధలు పెట్టుచున్నాడు. ఇదె చూచితిరా యెంతబల్లి దీనిలోఁ బడి యుడికి చచ్చినదో! దీనిపైన మూత యుంచుదమన్న మనస్థితిలో నొక్క యుత్తడి సిబ్బియైన లేదు. మనయిత్తడిముంతలే వంటకుఁబై పనికిఁగూడ నవురియుండుటచేత పాత్రసామగ్రిలేని లోపము కానుపించకయున్నది. అన్నముడికినదిగదా యనినీళ్ళకు నేబోవుటచేత నీప్రమాదమువచ్చినది. ఇఁక నేమిబుద్ధి యని దుఃఖించుచుండగాఁ దిమ్మరుసు పెళ్లా నిట్లనియె. ఓ వెఱ్ఱివానా భాగ్యస్థితిలో మఱియు విశేషభాగ్యము సంప్రాప్తమగుట భాగ్యభంగమున కెట్టి హేతువో యటులనే దరిద్రస్థితిలో దరిద్రాధిక్యమంనుటయునట్టిదే. కావున మనకిపి దరిద్రములో సంభవించినమహాదరిద్రము. దీనితో నిఁక మనదరిద్రభంగమయినది. వగవకుము. నేటిదినము మనముదకమును సేవించి కాలముగడపుదము. రేపటికే మనచిక్కులుతీరగలవు. అని చెప్పి తాను బొట్టుంచుకొని యుదకంబు గడుపునిండఁద్రావె. అతనిభార్యయునటులజేసి యాపాత్రిలోనియన్నము పశుపక్ష్యాదులుతిని యేమియాపద నొందగలవో యని భయపడి మఱియొకగోతంబోసి పాత్రములు శుభ్రము చేసుకొని నాటిది

నముహూర్తవాసరము కాగా నాయుడుపురమును గడిపి ప్రయాణముసాగించి ముందుమార్గముంబట్టినడచిరి.

### తిమ్మరుసునకు రాయండందలంబునంపుట.

ఇక్కడదిమ్మరుసునుగూర్చి మూడునాలుగు దినంబులు రాయండువెదకించెను. అతనిజాడయైనఁ గానరాకుంటకెంతయువగచి తనకాగ్రహమువచ్చినదను కారణమున నతఁడుమానుషవంతుడుగావున బ్రాణములు విడిచెనేమో యనిభయమందనారంభించెను. క్రమక్రమముగదిమ్మరుసు తనకుఁగలిగినగ్రహచారనివారణార్థముగా గృత్స్నచాంద్రాయణాదులఁ జేయనుద్దేశించి తనపుత్రుల మిత్రులవారిబాంధవుల కడకుంబంచి తనకుగలధనమును గృహారామక్షేత్రాదులను వదలుకొని కేవల భార్యాయుక్తుఁడై పోయియుండెననుమాటనువిని యతని బుద్ధికౌశలతకును, యోచించిన ప్రతికారంబునకును మిగులసంతసించి యిట్లుగానే లతిమ్మరుసుచేసి యుండవలెను, తానుచేయవలసియుండెనేని యీకార్యముల నిచ్చటనే యేలచేయగూడదు. ఇతరమంత్రులతనతోడ జేసినకుట్ర కతనిగ్రహచారమే కారణమైయుండును, లేనినాడతనికి కార్యములలో నాబుద్ధిపొరబడుట తటస్థించదు. దుర్మార్గులుతంత్రములుపన్ని నన్నాతనియెడనిష్కారణ మాగ్రహముగలవానినిగా జేసిరని చింతించి

తిమ్మరుసునిదిరుగఁ దీసి తెచ్చునుపాయం బాలోచించుచుండె
తిమ్మరుసు పోయినమార్గముం గూర్చి విచారింపఁగా నదిసు
లభముగా నూహకు రానందున నాలుగుదిక్కులకు నలుగురు
మంత్రులనుదగు వాహనాదికములతో బొమ్మనియాజ్ఞయొ
సఁగి కాశిమొదలు రామేశ్వరమువఱకును, బూర్వసము
ద్రము మొదలు పశ్చిమ సముద్రమువఱకునుండుదివ్యక్షే
త్రములు, దివ్యనదులు, పరిశీలించి యతనిఁ దోడ్తేనాజ్ఞయొ
సంగె. అట్టివారిలో దిమ్మరుసుండుచున్న దిక్కునబోయి
నవారతని వెదకుచుఁ బోయిపోయి యతనిని బల్లిపడి యు
పవాసము చేసినమాఱునాడు సూర్యోదయ సమయంబునఁ ద
ర్శించిరి. ఇట్లుగా నతనిని దర్శించి యతనికిఁ గా రాయఁడొసం
గిన లేఖనందించి యతఁడిల్లు వెడలిన యనంతరము జరిగినవృ
త్తాంతమంతయుఁ బూసగ్రుచ్చినట్లుగా వివరించి రాయని
పరితాపంబు విన్నవించి యంతటితో బ్రయాణముసమాప్తి
జేయఁ బ్రార్థించిరి. తిమ్మరుసు దాను భార్యతో జెప్పినప్ర
కారమే తమదుర్గ్రహాచారకాలము ముఁగిసెనని యూహిం
చి రాజాజ్ఞానుసారమే తానువచ్చెదనని రాజమంత్రులకుం
జెప్పె. వారునుదమతో దెచ్చియున్న యందలములలోఁ
దిమ్మరుసు నొకదానిలో నతనిభార్య నొకదానిలో గూర్చుం
డఁబెట్టి పరమ రాజోపచారములతోఁ గొన్ని దినములకుఁ

దమరాజసన్నిధికి దోడ్తెచ్చిరి ఇట్లుగా దిమ్మరుసునచ్చుచు న్నాడను వర్తమానంబువిని రాయఁడెదురుగఁబోయి యతని నాలింగనంబుజేసి కన్నీరునించుచు నన్నెన్నిదినములువదిలియుంటివనుచుఁ దిమ్మరుసు ఆనందబాష్పములు జడిగురియ నాయనా నేను చేసినదిది కాదు. నాగ్రహాచారము చేసినకార్యమిదియని తెల్పి రాయలబుజ్జగించి విశేషవిభవంబుతో దినగపట్టణముతో నాయిరువురుఁ బ్రవేశించిసుఖంబునుండిరి.

కృష్ణరాయచరిత్రములోని తిమ్మరుసువర్ణనము.

ఉ. కరచరణాదులందుజితికిఁ గల్గినయంతట నేసమర్థతన్।
మొరవడిఁ గాంచనేర్తురెమ-నీషివరుల్ ధరలోన నెవ్వరి।
క్రాగణినూటింపఁ మక్ష్ గృతయాగంబునదేవ్రతను దాస్పరంబునం।
బరంగ సాళ్వతిమ్మసచివాగ్రణికిన్ సరి మంత్రిగల్గునే॥ అని

ఇట్లు తిమ్మరుసును కృష్ణదేవరాయలు సింహాసనమెక్కిన యనంతరమే కొన్ని సంప్రశ్నముల నడిగినట్లును వానినన్నిటికి నతండు సమాధానముల జెప్పినట్లుగానున్న వానిని క్రిందవివరించెదను.

గీ. అప్పయీవరదనుక సిం-హాసనంబు।
భారమున్ నృసింహరాయల-పాదుబూన।
నిర్భరతనుంటినాయందు-నిల్పెగాన।
నఖిలకార్యస్థితుల్ దెల్ప-నయ్యెయిపుడు॥

౨ ప్రభుత్వమునకు సప్తాంగబలముండుట యావశ్యకము. అవి యెవ్వియనఁగా:— ౧ స్వామి, ౨ అమాత్యులు, ౩ సుహృత్తులు, ౪ కోశము, ౫ రాష్ట్రము ౬ దుర్గములు, ౭ బలము, వీటిని వేఱువేఱుగా దెలిసికొనియుండవలయును

౩. రాజ్య, వస్త్ర, ఆభరణ, ఘనసార, తాంబూలములు. వీనిం గూర్చి రాజులకు ముఖ్యముగా తెలియవలయును.

౪. సామము, దానము, భేదము, దండనము, మాయ ఉపేక్ష, మహేంద్రజాలములను నవి సప్తమహోపాయములు.

౫ వేఁట, జూదము, పానము, వెలఁజనుట, (వెట్టిజనుట యని పాఠాంతరము) తిట్టుట, నిర్హేతుకముగ దండించుట, అనుచితవ్యయము సేయుట యివియేడును సప్తవ్యసనములు.

౬ ౧ ధనము పాతిపెట్టుట, ౨ దేవాలయము గట్టుట. ౩ వనము జేయుట, ౪ పడుగు పెండ్లిండ్లు జేయించుట, ౫ తటాకములు త్రవ్వించుట, ౬ పుత్రులను గనుట, ౭ కవిరాజసమూహమును, ౮ ఇతిహాసములు, ౯ పా

రాణికులు. ౧౦ పరిహాసక సముదయము చేగొల్పించు కొనుట రాజులకుండవలయును.

౭. సప్తసాగర పరివృతమగు సకలభూమియందును, అష్టాదశ ద్వీపముల యందును, తన కీర్తి ప్రతాపములు వ్యాపించునట్లుగా రాజుచేయవలయును.

౮. సప్త కులపర్వతములయొక్కయు, సప్త ఋషులయొక్కయు మహిమలను, చక్రవర్తుల చరిత్రములును, సకలరాజ పుణ్యకథలును, రాజువినుచుండవలయును.

ఇవి యన్నియుఁగాక నాస్తికతయు నపరిహాదంబును, ఆలస్యంబు మొదలగువాని గుణముల నుపేక్షింపవలయును. మంత్రంబుల రక్షింపుచుండవలయును. శుభకార్యములఁ జేయుచుండవలయును. దుష్టనిగ్రహ శిష్టపరిపాలనంబుఁజేయుచు సత్యంబుఁదప్పక యుండవలయును. ఇట్లున్నచో నారాజునకు రాజ్యంబు సమృద్ధంబుగాఁ గలదు. అనఁగా సమయోచితవర్షంబులు కురియును. సర్వసస్యంబులు మెఱయును. భాండాగారంబుల ధనము నెఱయు గావున నీవును ధర్మమార్గము చేతఁ బ్రజలఁ బాలింపుమనుడుకృష్ణరాయలెంతయుసంతసించె.

## కృష్ణరాయలు రహస్యముగా నిలువెడలిపోవుట.

ఒకనాడు కృష్ణరాయలు తనలోతానిట్లుగాఁ జింతించె.

నన్ను నృసింహరాయఁడు సింహాసనమునకుఁ గర్తనుజేసెను. కానిపరిజనంబులందఱును స్వతంత్రవృత్తినిఁ బ్రబలిసంచరింపుచుండిరి. ఇపుడే నేమనిన నది కొనసాగునో లేదో దానినరయవలసియున్నది. అని లోనూహించుకొని దానినెవ్వరికిఁ దెలియనీయక పట్టణశోధనార్థము జనినట్లుగానతఁడు పురిబైలు దేరి తత్పురంబున కనతిదూరంబగు నొక దేవస్థలములో నొక్కఁడును బ్రవేశించె. అచటిస్థానికులాతనిఁబోల్చి పరిమళజలంబులీయ రాయలు నామతీర్థంబొనరించి తద్దేవతానివేదన పదార్థము లుపయోగించి కృతాచమనుండై సుఖాసీనుఁడై యుండె.

### తిమ్మరుసు రాజును వెదకించి కాంచుట.

ఇట్లుఁగా రాజువచ్చి యీదేవళంబులో నుండునపుడు నచ్చటతిమ్మరుసు రాజుకానుపించకుండుట కెంతయుఁజింతించి తత్తరింపుచు వేగులవారిని నలుదిక్కులకుఁ బంచిరహస్యముగా రాజొక్కఁడే పోయియుంటఁ దెలిసికొని తానునొక్కఁడుగా బయలుదేరి రాయలున్నచోటికింబోయెను. అట్లుగా తిమ్మరుసు తనరహస్యమునుఁ దెలుసుకొని వచ్చుచుండుట దూరముననుండగనే రాజుగన్పెట్టి అట్లుగానతఁడువచ్చుట కెంతయుఁగోపించి నిద్రపోయినట్లు గన్నులు మూసికొనియుండె. అంతటఁ దిమ్మరుసు రాయలిసన్నిధా

నాబునకుఁబోయి కృతాంజలియై నిలచినఁజూచి రాయఁడి ట్లనియె ఏమి! ఇచ్చటి కేమికారణమున వచ్చియుండిరి. అనుడు, దిమ్మరసు భయవినయంబు లెసఁగ నిట్లనియె. స్వామీ! దేవరయిటవచ్చుటెఱుఁగక వెదకుచున్నాను రహస్యముగా నొకనాఁడేలిక వచ్చిన జాడఁదెల్పిన వారల కెవ్వరికి నీవార్తఁ దెలియనీయక యుంచి వేటకుఁగాఁ బ్రభుఁడు పోవుచున్నాఁడుగావున మీరందఱును సన్నద్ధులై రావలయునని వర్తమానంబులు పంపి వచ్చినాఁడను మీ యిష్టానుసారముగా నేకార్యముం జేసిన జేయుటకనువై సకలవిభవములతో నీపురమును వదలి యిటుల రాఁదగునా? ఈవార్త యితరులెవ్వరైన వినినచో నెంతవైపరీత్యము సంభవించును సర్వజ్ఞులగు మీయట్టివారీరీతిని సామాన్యులు వచ్చినట్లుగా రాఁ జెల్లునా అనిరాజునకు న్యాయనిష్ఠురముగా దిమ్మరసు చెప్పిన రాజతనికిట్లనియె- అఘటనఘటనాసామర్థ్యముగల మీయట్టి మంత్రిపుంగవు లుండగా యథేచ్ఛాసంచారము నిర్విచారముగా మేము జేయవచ్చునుగదా- మీరు సామర్థ్యముగల సామాజికులగుటంజేసి మీరుతలఁచిన తృణమును మహామేరువుగాఁ జేయఁగలరు మీరుకాదన్నచో మహామేరు వయినను దృణమేయగును ఇట్టిమీయట్టి మంత్రులుండుట ప్రభువులపూ

ర్వజనసౌభాగ్యముగదా అనుచు రాయలమాటలు విని యో
ప్పాజీయిట్లనియె స్వామీ! మేమనఁగా నెంతటివారము
ప్రభువులయాజ్ఞావిలాసము ననుసరించి భయభక్తులతో మె
లఁగువారముగాము. తృణగ్రాహియైన నీలమున కెచ్చట
ను విలువయధికమేయగుగదా కానియది కేవలము తృణ
ముగావున దానిఁ గ్రహింపఁగూడదని వదులుకొనుమాత్ర
మున నయ్యది జాతినీలముగానట్లుగాఁ బ్రభువులు పరిగ్రహిం
చినఁ బ్రజలే గౌరవనీయులగుదురు. ఏలినవారి ప్రతాపము
లమునఁగాని యస్మత్సమర్థత మేలుకలుగును. దేవరవా
రేయే ప్రకారముగాఁ బలికినచో నింకఁ దెల్పుకొనఁగలసమర్థు
లు ప్రజలకెవ్వరున్నారు? ఏలిక యేప్రకారముగ బుద్ధులు
చెప్పిన నాప్రకారముగాఁ గార్యములు నడచును. కావున
నేలికయాజ్ఞ యెట్లో అట్లే సమస్తకార్యములను నడపెదము.
పట్టణమునకు విచ్చేయుఁడని భయము, నయము, వినయ
ము, నేర్పడఁ బలికిన తిమ్మరుసునెడ సదయుండై కృష్ణరా
యఁడిట్లనియె. ఇదివరలో మీరు దుష్టనిగ్రహంబును శిష్టప
రిపాలనంబును జేయుటతగవని నాకుం జెప్పియుంటిరి. అట్టి
నీతినడపుటకుఁ దగినమార్గము కానుపించెనేని నేను వచ్చె
దను. అని రాజు పల్కఁగా నాసాళ్వతిమ్మరుసు రాజుతో నిట్లని
యె. స్వామీ! యేలినవారు సెలవొసంగినది నిజమే ప్రస్తు

తేమునకుఁ గార్యరీతి యిదమిద్ధమని నిరూపించినచో దానినం
తయు సమకూర్చెదను. అట్టిసమయములో మీ దృష్టిలో
నిల్చియున్న కార్యము లెవ్వియో యానతీయఁ గోరెదను.
అనుడు నారాయణం డిట్లనియె. ఈసమయములో ముఖ్యము
గాఁ దురకలపట్టణములపై దండెత్తిపోయి వారందఱు న
గ్గోలుపడగా వానిని సాధించుటయే మాయుద్దేశము బుద్ధి
మంతులగు ప్రభువులు తమ సామంతులయొద్దనుండు బల
ముల నమ్మియుండుటకంటె తమ స్వంతబలమును గూర్చుకొని
యుండుటే నీతిమార్గమని తెలుపుటమనము వినలేదా? అ
నుడుఁ దిమ్మరుసురాజిట్లనియె స్వామీ! యీమాత్రి
ముపని కీవిధముగా నేలికరావలయునా. ఏలిక చిత్తానుసా
రముగా గార్యములన్నిటిని సిద్ధముచేసెదను ఇదె కనుం
గొనుఁడని యప్పుడేయయ్యుద్దండ దండనాథుండగు తిమ్మరు
సుమంత్రీంద్రుండు నిండు చాతురి మెఱయ సుధీచమత్కా-
రంబునెఱయ సకలజనంబులకు భయంబుబెరయ నయం బె
నయుచందంబున నెందెందుఁగల ధరాపురందరులఁ బిలువం
బంచి, చతురంగబలంబుల నెన్నిక జూపించి యక్కాలంది
కిఁదగిన రొక్కంబిచ్చి బహుదినంబులనుండి యనుభవించిన
దేశంబులెంచి యట్టివానివలన రావలసిన సొమ్మునకుఁ దగు
సేనలఁదెమ్మని యాజ్ఞాపించిన వారుపోయి యేనూరు వేరం

డంబులను, నఱువదివేల భటులను దెచ్చి నగరిరక్షణము చేసిరి అట్టి తిమ్మరుసు పని కెంతయును సంతసించి రాయం డతనికి బచ్చల కడెములు బహుమాన మిచ్చి జాంబూనదాంబరాభరణంబు లొసంగెను. అట్లుగా జేసిన రాయండు చతురంగబలంబులతో నడువ గజారోహణంబు జేసి యమ్మంత్రిమణితో నిజరాజధానికివచ్చి ప్రవేశించె.

తిమ్మరుసు కార్యమును సభికులు నుతించుట.

గీ. తలఁచినట్లనె చతురంగ-బలము గూర్చి।
ధరణిసఘటనఘటనచా-తురి జెలంగ।
సాళ్వతిమ్మరుసయ్య కు-సాటి యైన।
మంత్రివర్యుండు గలఁడె యి-మ్మహిని రహిని॥

క. వినుపంచలోహములలో।
ననుబంగారంబు హెచ్చ-నందగు ట్టులన్।
మనుజులలో సామర్థ్యం।
బెనసినసద్బుద్ధిమంతు-డెన్నఁగ వలయున్॥

అను మొదలగు వాక్యములతోడ నయ్యమరుసు మొదలగు సభ్యులు తిమ్మరుసును నుతించినట్లున్నది. ఈ యయ్యమరుసు నెవ్వరో స్పష్టము కాలేదు. ఇతఁడు నొకమంత్రియగునట్లుగాఁ గాన్పించెడు. ఈ యయ్యమరుసుం గూర్చి కోమలాపురముపృత్తాంతములో గొంత వివరింపఁబడినది. దానింబట్టి తిమ్మరుసునకు నతనికిఁగల సంబంధము తెలుపంజాలము

కృష్ణదేవరాయుని యాస్థానములోని సామంతమండలనాథు లును, వారివిషయమైన సాధ్యమైనంత వృత్తాంతమును దె లియవలసియే యున్నది గావున గామలాపురము కైఫియ్య తులోనున్న దానిని క్రిందవివరించెదను. అదెట్లన్నను—

“ఈగ్రామమునకు (చరిపిరేలగ్రామమునకు) ఉత్తరం పడుపుమారం కామలాపురమునకు పడమర రెండుపరువులు పందిపళ్ళె అనేగ్రామ ము కృష్ణదేవరాయలయ్యమురుసయ్యగారికి ఘండికోటసీమలోని పం డిళ్ళపల్లెగ్రామనాయంకరానకు పాలించియుండగాను అయ్యమురస య్యగారు కొమరగిరినాయనికి, రంగప్పనాయనికి అమరనాయంకరా నకుపందిళ్ళపల్లెగ్రామంయిచ్చియుండగా, రంగప్పగారు కృష్ణదేవమ హారాయలకున్ను, రాయసం అయ్యమురసయ్యకున్ను పుణ్యముగా శా॥ స॥ ౧౪౪౭ అను నేటి సర్వధారిసం॥ కార్తీక శు ౭ స్థిరవారము నాడు చెన్నకేశవస్వామి కూడిగము చేసే డోలుసాగసరాలవారికి చే సు ఖ ౦౪౦ యిచ్చె” అని.

దీనింబట్టి యీఅయ్యమురుసయ్య యింటిపేరు రాయ సమువారనియు నితడుకృష్ణదేవరాయునివలన ఘండికోట సీమలోజేరిన పందిళ్ళపాటికి నాయంకరముగా నిర్ణయింప బడినవాఁడనియు దేలినది.

తిమ్మరుసు గజపతితో యుద్ధము వలదని కృష్ణరాయలవారిం మటి

కృష్ణరాయలు తురుష్కసైనికుల నందఱంజయించి వి
రాజేశంబున నాపట్టుననే కటకముపై దండెత్తిపోయి గజ
పతింజయించుటకు యత్నించుచుండగా నట్లు చేయుటజ
యావహమైనపనికాదని తిమ్మరుసీక్రింద వాక్యంబుల రాయ
లవారించె నెట్లన్నను.

చ. ఇతరులశక్తులేతలప-నేదులశాహు నిజాముశాహులన్।
కుతుపసమ్ముల్కనుం గెలిచి-గొబ్బునసర్వగిరీంద్రదుర్గముల్।
చతురతగైకొనంధరన-సాధ్యమునీకెటుగల్గదెసనం।
చితయుళయొక్కవిన్నపము-జేసెద వేడుకఁ జిత్తగింపుమీ॥

ఉ. లిన్నదనంబునం గజప-తిం గెలువంజనుటొప్పగాజయా।
పన్నశరణ్యశైలవన-పఙ్క్తులు దాటితడీయసీమలో।
వన్నెలజూచివారలు ఘ-నంబుగ మార్గములడ్డగించినన్।
సన్నుతశౌర్యరస్తుమన-సైన్యము జేరుటదుస్తరంబగున్॥

అనియిట్లుగా భావ్యనర్థమునుభాషించి తిమ్మరుసు మం
త్రిచెప్పినమాటలు యప్పటిలోనతనికిఁ గలిగినజయోత్సా
హంబులంబట్టి నాటినవికావు దానికి సమాధానముగా న
తడునప్పు తిమ్మరుసుతో నీక్రిందివిధంబునంబలికె. ఎట్లన—

చ. అనటయు చిన్ననవ్వునగి-యప్పయిదెంతటికార్యమయ్యెయీ।
ఘనగిరివస్తులెంతతతి-వచ్చుటయెంతస్వహస్తదేశము।
లనసువశంబులయ్యెపద-మామదమానముసంశయంబునై।
మనమునమానుచునివిజ-నం తిసమానమటంచు బల్కెమన్॥ ఆ౨.

### కృష్ణరాయలు తిమ్మరుసునుపాయము తప్పింపఁ బ్రార్థించుట.

అట్లుగాఁ గృష్ణరాయలు తిమ్మరుసు వాక్యములఁ బాటింపక గజపతిదేశముపై దండు వెడలె. ఆవర్తమానము గజపతికి దెలిసినవెంటనే యతనికడనుండు పాత్రసామంతులు పదియార్వురు కృష్ణరాయల గెల్చెదమని శపథము జేసి తాంబూలంబెత్తి గజపతిని వెంటదీసుకొని కృష్ణరాయలతో మహాఘోరంబుగాఁ బోరవచ్చిరి. ఇట్లుగా నాపాత్రసామంతులు విజృంభించి వచ్చుచున్న వార్తను విని కృష్ణరాయం డుడుగులొంది యప్పాజీ చెప్పినమాటలను మనము లక్ష్యము చేయక వచ్చినారము. కావున మన మిట్లుగా నవమానమునం దుటకు హేతువయుచున్నది ఎట్లైన దిరిగి యప్పాజీనే యుపాయాంతర మడుగవలయునని యప్పాజీకి వర్తమానమును బంపించి పిలిపించి రాయండు జరుగుచున్న వృత్తాంతమంతయుం దెలియఁజేసె. అప్పుడప్పాజీ రాజుం జూచి స్వామీ నేను మొదటనే యిట్లువచ్చునని విన్నవించితిని. ఇప్పుడేమి చేయఁగలవారము. ఈపట్లనేదైన నొక భేదోపాయం బరసి మనకార్యము నెరవేర్చవలయునుగాని రెండవమార్గమున గెలువనులేము శత్రువులయెదుట నిలువనులేము. కావున భేదతంత్రంబే గావింపవలయును దానికి వలయుపరికరములు దయసేయుఁడనుచు కృష్ణరాయలు బొక్కసము

నీ వశము చేసుకొని యేది యెట్లుగా నడుపుకొన వలయు నో దాని నట్లు నడుపుమని యాజ్ఞయిచ్చెను.

తిమ్మరుసు మిత్రభేదతంత్రము

అపుడు తిమ్మరుసు భేదోపాయమునరయుచు కొంతవడి చింతించి తనభృత్యులంబిలిపించి దానికిగాను నలయు సంబారములు దెప్పించె. అట్లుజేసి తాను రాయలపేరుబెట్టి యొక యుత్తరమును వ్రాయించి మందసముల దెప్పించి వానిలో రాయలుధరించువస్త్రాభరణంబులుంచి వానిని గజపతియున్న వైపునకు బంచిన నాగజపతిభటులు పైమందసముల దెచ్చినవారిబట్టుకొని గజపతిరాజుసన్నిధి నొప్పించిరి. అపుడు గజపతి సంశయాంతఃకరణుండై ఆపెట్టెలు విచ్చి యున్న తళుకుబంగారుకాకితములోని సారాంశము తెలియం జదువుకొనంగా దానిలో నీక్రింది వాక్యములున్నవి. ఎట్లన్నను,

సీ. శ్రీమతుకర్ణాట సింహాసనాధ్యక్షుఁ,
డగుకృష్ణరాయధ-రాధినాథుఁ
డలపదారుగురుపా-త్రులకుసంప్రీతిఁబం,
పినవిరూపంబులు-మిమ్మునుపుత్రు
గజపతిరాష్ట్రిదు-ర్గవిశేషవార్తను,
బలికినపలుకులు-బదులుతీరు
వ్రాయుంచితిరిమీరు-వాసినయట్లనూ,
భరణదుకూలము-ల్పంపివారి

సీ. మట్లనే రేపుజగ-ద్దానకరుఁగుఁ డెంచి।
నట్లుచను డెంచిమా చేతి-కతని మీాఁకు।
పట్టియిచ్చినయాపు డేమి-పట్టమేము।
కొందువపడకుండఁ-డిపించుకొనెద మెపుడు॥ అని.

ఇట్లుగానున్న యావార్తం గనుంగొని గజపతి తనలోన నిట్లు చింతించె. ఆహాహా! లోకమునం దెవ్వరిని నమ్మఁగూడదు. ఎంతగా మనము నమ్మిన వారినలనంత మోసమాయెను. ఇట్టివారిని నమ్మి మనము యుద్ధమునకు దిగిన నేమిమూడునో? కావున మనజాగ్రతయం దుంటమంచిదని గజపతి యితరులకుఁ దెలియనీయక యొకానొకచోటికిఁ బోయియుండె. ఆమరునాఁడు పాత్రసామంతులు గజపతి యుద్ధభూమిని లేని వార్త నువిని దొర లేనిపోటుందునా యని యూహించి యుద్ధయత్నము మానియుండిరి. అట్టి వృత్తాంతంబుఁ దెలిసికొని కృష్ణరాయఁడు తనకుఁ ద్రైలోక్య సామ్రాజ్యంబబ్బినట్లు సంతసించి తనజయధ్వజం బెత్తించె. ఇట్లు చేసియు గజపతి యుండు నెలవునకుఁ దన సేనలు పోకుండునట్లుగాఁ జేసె.

### తిమ్మరుసు పోయి గజపతి దోడ్తెచ్చుట.

అప్పుడు కృష్ణరాయలు తన మంత్రియగు తిమ్మరుసుతో నిట్లనియె. నా ప్రతిన చెల్లెను. కావున నీవు గజపతికడకుం బోయి నరాజ్యము నీవే యేలుకొమ్మని చెప్పి యతనిం దోడ్తెమ్మనుడుఁ దిమ్మరసు గజపతి సమ్ముఖమునకుం బోయె. అట్లు

గాబోయి యతనిందర్శించి కృష్ణరాయుఁడు తన్నుంబంపిన
వృత్తాంతంబతనితో విన్నవించె. అట్టిమాటలువిని మొద
టకొంతసందేహించిన రాయలతనితో బంధుత్వముచేయు
తలంపుతో బంపినశుభవార్తగా దానిందెలిసికొని, కాను
కలుపట్టించుకొని రాయలకుసమర్పింప వచ్చినవార్త రా
యలెరింగి గజపతిరాజు కెదురుగజని గౌరవసూచకగాఢా
లింగనంబొనరించి యతనిసతిప్రేమతో దోడ్కొనివచ్చి తే
నరత్నసింహాసనమున గూర్చుండబెట్టి తానొక యుచితాస
నంబున గూర్చుండియుండె. అట్టికృష్ణరాయల యాదరణా
మునకు నతనిరసికతకంతయు సంతసించి గజపతియిట్లని
యె. ఓ రాజేంద్రా! విరసించినవారి నిరసించుటయును శర
ణనువారలను రక్షించుటయును నీకే తగును. కాని రాజుల
లోనిక నేరికిదగును? నీవు కన్నుగటాక్షంబున దిరుగ నాసిం
హాసనంబునఁ గల్పినాఁడవు ఇట్టి నీ ఋణమును నే నెట్లుతీర్చుకొం
దును. అయినను నా కుమారిక నీకిచ్చి కొంతమఱలించు
కొనెదను. అనఁడు తిమ్మరుసు గజపతికిట్లనియె. ఆహా! రా
జవర్యా నీవిపుడుచేసిన యాలోచనము క్షీరసముద్రుఁడు లక్ష్మీ
దేవిని శ్రీమహావిష్ణువునకిచ్చుటయట్టిదేగదా నీభాగ్యము
డుగనేల- అనఁడు కృష్ణరాయలు గజపతితో నిట్లనియె. ఓ
రాజోత్తమా! నీవు నేనను భేదమును మనమెంచుకొనవల

సినపనిలేదు. నీయిష్టమేనాయిష్టము కావుననీవు వివాహ ప్రయత్నము చేయుము. అనుడుగజపతి కృష్ణరాయలంజూచి రాజేంద్రా! నాకుమారిక రూపరేఖావిలాసములంజూచి వచ్చుట కప్పాజీమంత్రిని నాతోఁ బంపవేడెదను. అతఁడును వెంటనే తిరిగిరాఁగలఁడు అనుడు కృష్ణరాయలు తిమ్మరుసు మొగంబుఁగన్గొనుడు నాసన్న యెఱింగిమహాభాగ్యము చేసినాడనుగావునబట్టుమహాదేవిం జూచివచ్చెదనని పలికెను. అంతటఁగృష్ణరాయలు గజపతికి విశేష బహుమానంబులనిచ్చిసెలవొసంగగ నతనివెంటనే తిమ్మరుసుపోయి యనేక కక్ష్యాంతరంబులుగడచి యొకనవరత్న నిర్మితమగు దివ్యభవనంబుఁజేరె. అపుడుగజపతి తిమ్మరుసును నొకరత్నపీఠముపైఁ గూర్చుండఁబెట్టి యుతనికనేక భూషణాంబరంబులొసంగి యోమంత్రివర్యా నీయట్టిమంత్రి దేవేంద్రునకైన దొరకునా? కృష్ణరాయలకును మాకును బంధుత్వముజరుగుటకు నీమాటయేగదా కారణమాయెను. అని తిమ్మరుసుతో ముచ్చటించుచు గజపతి యాప్తజనులఁబంచి తన కుమారికం బిలిపించె. ఇల్లువచ్చిన తనకుమారికంబిలిచి తిమ్మరుసునకు నమస్కరింపుమని తెలుపుడు నాబాలిక తిమ్మరుసునకు నమస్కరించెను. అపుడుతిమ్మరుసు నాచిన్నదానింజూచి

కృష్ణరాయల సౌందర్యాదులకుఁ దగినబాలికయని మనస్సున సంతసిల్లి యీక్రిందివిధంబున నాశీర్వదించె.

గీ. అమ్మకర్ణాటసింహాస-నాధ్యుఁడగుచుఁ।
జెలఁగుశ్రీకృష్ణరాయలఁ-జెట్టబట్టి।
మాతృరాశ్రితజనులునీ మహిమానుతులు।
సేమవరిల్లుమనిపల్కె-చెలువుమీఱ।

ఇట్లుతిమ్మరుసు నాశీర్వదింపఁగా నా తుర్కారమణీమణి తండ్రియాజ్ఞానుసారముగాఁ దిరుగ నంతఃపురమునకుఁ జని తాఁబెంచిన చిలుకనంతఃపురినుండి తనతండ్రి భవనంబున కుంబరిచె. అదివచ్చి వ్రాలినవెంటనే గజపతితిమ్మరుసుతోన ది తనపుత్రిక బెంచినచిలుకయనియును దానిం గొంపోయి రాయలకొసంగిన నాబాలికామణి సౌందర్యాదికమువర్ణించిచెప్పుమని తెల్పి తిమ్మరుసునకు గజపతి సెలవొసంగె అంతటఁదిమ్మరుసు రాయలకడకు వచ్చి కన్యాసౌందర్యాదులు వర్ణించిచెప్పి సుముహూర్తంబు నిశ్చయించి వివాహంబు జేయించె

అనియిట్లనేకస్థలంబులలోఁ దిమ్మరుసుని విశేషంబులు కృష్ణరాయవిజయమునఁ గాన్పించును.

### శాసనవిషయము.

ఈతిమ్మరుసు స్వయముగఁ జేసిన శాసనములు కొన్ని యున్నవి. వాటిలో నితనింగూర్చిన విశేషములు గొన్ని

కాన్పించును. ఆశాసనములన్నింటిని వివరించుట గ్రంథబాహుళ్యకారణము గావున వానిలోని సంగ్రహమును వివరించియితిని గోత్రనామాదికములఁ దెలియఁజేయు కొన్ని శాసనములను మాత్రమీ చారిత్రమునకుఁ బిదప వివరించుచున్నాఁడను

౧. శా॥ స॥ ౧౪౩౨ (A, D, 1510)

కామలాపురమునకుత్తరమున నొకపర్వదూరమున సమ్మటూరుగ్రామము పంపరిగోత్రీను దేవినాయకుడు, బొజ్జమనాయనికుమారుడు పాపతిమ్మనాయనిగారికి శ్రీకృష్ణదేవరాయల సర్వప్రధానులైన సాళువతిమ్మయ్యగారికి కార్యకర్తలయిన సోమయ్యగారు మాకుపాలించిన సమ్మటూరుకుంచెల్లేకింతామరెడ్డిపేట సుంకము, చెమ్మటూరి చెన్నకేశవస్వామికి అఖండదీపారాధనకు తిమ్మయ్యంగారికిని సోమరుసయ్యగారికిని మాతండ్రి దేవినాయని ఉమానాయునింగారికిని పుణ్యముగాను సమర్పిస్తిమి శాలివాహన శకవర్షములు ౧౪౩౨ ప్రమోదూతసంవత్సర జ్యేష్ఠశుద్ధ ౧౫ సోమోపరాగ పుణ్యకాలమునందు శిలాశాసనము. సమ్మటూరుగ్రామమునకుఁ దూర్పుయిభరాంపురం పొలిమేరలోను దిగుపరాతిశాసనమున్నదని యున్నది.

శా॥ స॥ ౧౪౩౫ (A. D. 1513)

సింగరాయని కొండలో నొక ప్రాచీన విష్ణ్వాలయమున్నది. అందులో విజయనగరపు ప్రభుఁడగు కృష్ణదేవరాయలు దేవాలయార్థము కొన్నిగ్రామములు ధర్మము చేసినట్లున్నది

ఉదయగిరితాలూకాలోని యుదయగిరిదుర్గముయొక్క చారిత్రము దెల్పుచు నాదుర్గమును మొదట లాంగూలగజపతి కట్టించెననియు నతనియనంతరము వైద్యరాజులను వారు దానిని స్వాధీనపరుచుకొనిరనియు నువారియనంతరమశ్వపతులును, గజపతులును స్వాధీన పరచుకొనిరనియున్నది. ఈచివరి వంశ్యులలోనివారిపేరు గజపతి, అచ్యుతుడు అనంతుడను వారలనియు, వారిలోజివరివాఁడు విజయనగరప్రభుఁడగు కృష్ణదేవరాయనివలన జయింపఁబడినట్లున్నది. అచటనొకకృష్ణరాయనిచారిత్రము కొంతచెప్పఁబడినది అందులోకృష్ణరాయని పిమ్మట నారాజ్యముతిమ్మరుసు స్వాధీనమయినట్లున్నది. ఆపిమ్మటననఁగాఁ దిమ్మరుసుపిదప నారాజ్యము ముప్పనినాయనికి వచ్చినట్లునతఁడు మీరు జుమ్లావలన జయింపఁబడినట్లున్నది.

శా॥ స॥ ౧౪౪౦ (A. D. 1518)

కొండకావూరులోని హనుమంతుని విగ్రహము దగ్గర

ను శాసనమున్నది. దానిలోఁ గృష్ణదేవరాయని మంత్రి
యగు తిమ్మరుసయ్యగారి వలన శా॥ స॥ ౧౩౯౩ (ఇది
౧౪౪౦ కావలెను) నగుసరియగు బహుధాన్య సంవత్సర
మున నీయఁబడినయొక ధర్మంబునుగూర్చి వివరింపఁబడియె.

పై వత్సరములోనే విజయనగరములోని ప్రభుఁడగు
కృష్ణరాయుని రాజ్యకాలమున నీయఁబడినయొక శాసనము
న్నది. ఈశాసనమొక క్షత్రియునివలనఁ జేయఁబడినది.
ఇంకాలోఁగృష్ణరాయని మహాప్రధానియగు సాళ్వ తిమ్మ
రుసు పేరు తరుచుగా వచ్చుచున్నది.

శా॥ స॥ ౧౪౪౦ [A. D. 1518]

గుంటూరుతాలూకాలో కాకానిగ్రామములో వీరభ
ద్రస్వామి గుడిముందరనున్న రాతిపైని శా॥ స॥ ౧౪౪౦
లో విజయనగరము ప్రభుఁడగుఁ గృష్ణదేవరాయని మం
త్రియగు సాళ్వతిమ్మరుసు యిచ్చిన శాసనమని యున్నది.

ఇటువలెనే బాపట్లగ్రామములో భావనారాయణస్వా
మిదేవాలయములో శా॥స॥ ౧౪౯౦ లో కృష్ణదేవరాయని
మంత్రియగు సాళువతిమ్మయ్యవలన నీయఁబడిన దానశాస
నమున్నది శాసనకాలము ౧౪౪౦ శా॥స॥

ఇటువలెనే బెజవాడలో వశిష్ఠగోత్రం పాపరాజపుత్త్రి
సింగరాజకృతశిలాశాసనములోఁగూడ నీకృష్ణరాయలంగూ

చ్చియు నతనిమంత్రియగు పార్శ్వ తిమ్మరసుం గూర్చియు విశ
దపఱచబడియున్నది. దీనిశాసనకాలము ౧౪౪౦ శా॥స॥

శా॥ స॥ ౧౪౪౧ (A. D. 1519)

మంగళగిరిగ్రామములో నొకశాసనస్తంభమున్నది అ
దినాదెళ్ళవారి వంశస్థులవలన స్థాపింపఁబడినది దీని కాల
ము శా॥స॥ ౧౪౪౧ ఇది కృష్ణరాయలు తూర్పుదేశము
జయించుచున్నట్టికాలములోనిదియగుటంజేసి యీశాసన
మతిముఖ్యమగునదియగు దీనిలోనే శా॥స॥ ౧౪౩౩లో నీ
కృష్ణరాయనిసేనలు తత్సేనానియగు తిమ్మరసువలననడుపిం
పఁబడి కొండవీడును ముట్టడించినవృత్తాంతముఁగూడ విశ
దింపఁబడినది.

పై శా॥స॥ ౧౪౪౧లోనే విజయనగరములోని హజారీ
రామునిదేవాలయముపైని శ్రీమహామండలేశ్వర చిక్కతి
మ్మయ్యదేవమహాఅరసుకుమారుఁడగు తిమ్మరాజువలన వ్రే
యఁబడిన యొకశాసనమున్నది. ఇందలి మహాఅరసుబిరు
దాంకితుడు కృష్ణదేవరాయని మంత్రియగు తిమ్మరసు పేరు
గల తిమ్మరాజుకావచ్చును.

ఇంక నిటువలెనే మఱికొన్ని శాసనములు కాన్పించుచు
న్నవి. పై వాటిలోఁగొన్ని కేవలము కృష్ణరాయని మంత్రి
గానుండుటంబట్టి యీతిమ్మరసు పేరు చేర్పబడినవికొన్నియు

మఱికొన్ని తిమ్మరుసు చేసినఘనకార్యములఁ బ్రకటించునవియు, నింకొకకొన్ని యీతిమ్మరుసునాయంకరము క్రిందనుండు గ్రామములతో నీతనివలన నాగ్రామవ్యవహారముల జేయుచు నతనికిని, తనప్రభుఁడగు కృష్ణదేవరాయనికినిఁ బుణ్యముగా నిచ్చినవిగా గానుపించుచున్నవి. ఇట్టివానిలోఁ గొన్నిఁటి వివరించెదమని యిదివరలోఁ జెప్పియుంటిమిగావున వానినిక్రింద జూపెదము.

### తిమ్మరుసు సేవర్ణస్థుఁడని.

ఇతనివర్ణముంగూర్చి నిశ్చయించి మనము వ్రాయుటకుఁ బూర్వము మధ్యకవులచారిత్రమను గ్రంథములోఁ గందుకూరి వీరేశలింగము పంతులుగారు వివరించియున్న కొన్ని వాక్యములను, వారిసిద్ధాంతమునకు వారుచూపిన సాధన సామగ్రియుఁ బరిశీలించవలసియున్నది. అం దెట్లున్నదనఁగా "ఈమంత్రిశిఖామణి క్షత్రియుఁడైనట్లు, నింటిపేరు సాళువవారైనట్లు ననేకశిలాతామ్రశాసనములవలనను, గృష్ణరాయవిజయమువలనను తెలియవచ్చుచున్నది" అనువఱకు ముందుగా నాలోచించెదము. ఇంతవఱకును మనము కృష్ణరాయవిజయములోని సంగతులనుజూపినారము. శిలాతామ్రశాసనములను జూపినారము. వానియం దెక్కడనాతఁడు క్షత్రియుఁడని నిశ్చయించుట కనుపడలేదు. అట్టినిర్ధార

గాఁజేయుశాసనముల నెద్దానినైనం జూపినయెడల నవి వారికెట్లుగా సమన్వయించెనో పరిశీలింపవచ్చును. వారా పనిచేసియుండలేదు, కావున నంతవఱకును వారిసిద్ధాంతము నిలువఁబడలేదని చెప్పవలసియున్నది ఇఁకకొండకావూరిదేవాలయములోని యొక శిలాశాసనమువలన మాత్రమతనిపేరు సాళువతిమ్మరుసయ్యంగారని యుండుటంబట్టికొందఱాతఁడు బ్రాహ్మణుఁడని భ్రమపడినట్లు వ్రాసిరి. కాని ఆభ్రమపడిన వారిపేరుమాత్రము వివరింపరైరి. అట్లుగా వ్రాసినది॥ ఆర్. స్యూయల్ దొర. అతనిశాసనముల సంగ్రహములయొక్క మొదటిసంపుటములో ౭౦ పుటలో నీక్రిందిమాటలనతఁడు వివరించె. ఎట్లన్నను:—

"Timma Arusu is often mentioned in inscriptions, but this is the only place, I remember, where his caste as an *Ayyangar Brahman* is stated. Compare an inscription at *Kakani* (*Guntoor Taluk*)."

అనియున్నది. దొరగారొక పొరపాటుపడిరి వీరేశలింగంగారింకొక పొరపాటుపడిరి కాకానిలోని శాసనముంజూచి దొరగారేమి వ్రాసిరో దానింగూడ జెప్పి పిమ్మట పైవ్రాఁతల బరిశీలింతము. దానిలో పుట ౭౫

"On a stone in front of the Veerabhadra Temple is an inscription, dated S. S. 1440, of *Saluva Timmarasu*, minister of *Kristnadeva Rayulu* of Vizianagaram.

అనియున్నది. ఆదోరగారు దక్షిణాది దేశములో నయ్యంగారులను వైష్ణవ బ్రాహ్మణులను జూచియున్నారు గావున నీదేశములోఁగూడనట్టి శాఖవారలే యుండవచ్చునని యూహించిరి. పంతులవారు సాళువశబ్ద మున్నదిగావున నాతఁడు వైష్ణవ శాఖా బ్రాహ్మణుఁడుగాఁడు క్షత్రియుండని నిర్ధారణఁజేసిరి. ఆంధ్ర దేశములోనుండు వైష్ణవ బ్రాహ్మణులయ్యంగారులను పేరునుపయోగించుకొనక సామాన్యముగా నాచార్యులని వాడుకొందురు. వారిలో విశేష విద్యావివేకాదులవలనఁ బ్రతిష్ట నందువారిని వారి వారిశిష్యులును, మిత్రులును నయ్యవార్లంగారని చెప్పుటకలదుగాని యయ్యంగారని చెప్పెడునాచారము లేదు. ఇఁకనయ్యగారనుపదమును ఆంధ్రబ్రాహ్మణులలోని స్మార్తులుపయోగించుకొనుటగలదు. శైవులలో గురువులపేరులుచ్చరించకనే మా "అయ్యగారు" అని పలుకుటయు "అయ్యగారిసెలవైనదని" చెప్పుటయు వాడుకలోనున్నవి. ఈయయ్య శబ్దమీయాంధ్రదేశములోఁ గొంచెమెచ్చు తగ్గుగా నన్నివర్ణముల వారిపేరులతోఁ గల్పి వాడుకలో నుపయోగించబడినను గ్రంథాదులలో సామాన్యముగా బ్రాహ్మణుల పేరులతోడనే కానుపించుచుండును ప్రస్తుత సందర్భములో నిదియొక సిద్ధాంతముఁజేసి చె

ప్పటకు జాలకున్నను క్షత్రియులు మాత్రముదీనిని దమ పేరునకు జివరనుంచుకొని యుండరని స్పష్టముగా చెప్పవలసియున్నది. దానికిఁగారణమేమనగా క్షత్రియస్త్రీలలో గౌరవమైనవారిని ఆహ్వానించునపుడమ్మగారని లోకాచారముగానుండక "అయ్యగారని" యుండుటే తిమ్మరుసయ్య క్షత్రియుడేయైనయెడల స్త్రీయై యుండవలయునుగాని పురుషుడై యుండడని కంఠోక్తిగా క్షత్రియులుచెప్పును రు. కాబట్టి అయ్య శబ్దము క్షత్రియపురుషుని విషయములో నయ్యంగారు శబ్దము వైష్ణవబ్రాహ్మణ విషయములో నాంధ్రదేశములో నుపయోగింపఁబడవని సిద్ధాంతీకరించి చెప్పెదము.

రెండవమార్గముగా దిమ్మరుసు క్షత్రియుఁడని వీ॥ పంతులుగారు స్థాపింపయత్నించిరి. అదెట్లున్నదనగా-

"ఈసాళువ తిమ్మరాజు కృష్ణరాయుని తండ్రియైన నృసింహరాయుని తమ్ముఁడని కొందరుచెప్పుదురు. ఈసంగతి యథార్థమైనను కాకపోయినను అతడు నృసింహరాయుని యొద్ద మంత్రిగానుండెను. ఈర్ష్యచేత నృసింహరాయుని పట్టమహిషి సవతికొడుకైన కృష్ణదేవరాయుని జంపింపయత్నించినపు డతనిందనయొద్దనుంచుకొని కాపాడిన దీసాళువతిమ్మరుసే. ఈహేతువునుబట్టియేకృష్ణరాయులు తిమ్మరు

సును నప్పాజీయని పిలుచుచుండుటయు, అప్పాజీయనెడిపేరే పుస్తకములయందు సహితము వాడఁబడుచుండుటయు సుప్రసిద్ధమే "అనుపలబ్ధ ప్రస్తుతముపరిశీలింతము ఇందులో పంతులువారు సిద్ధాంత వచనములుగా నంగీకరించిన యంశములకు గ్రంథాధారములు లేవు. వీనినన్నిటినిఁ బుక్కిటపురాణములపైనే మోపినట్లుగా గనుపించును. అట్లుగా గ్రంథాధారములు లేనివానికి మనముసమాధానము చెప్పవలసిన యావసరముండదు. అయినను బాలకసౌలభ్యార్థము కొన్ని వాక్యములను వివరించెదముగాక. అందుమొదటిది ఈతిమ్మరుసు కృష్ణరాయని తండ్రియగు నరసింహరాయనికిఁ దమ్ముండగునా యనుదానినాలోచింతము. నరసింహరాయనికి తిమ్మరాజను నొకతమ్ముఁడున్నట్లు గ్రంథములలోనున్నది కావున కృష్ణదేవరాయ లతనిని బాల్యములో తననుసంరక్షించెనను విశ్వాసము చేఁగాకున్న దండ్రియే గనుక నప్పాజీయని పిలువవచ్చును. అయితే నాయిరువురు నొకరుకారని వారియిరువురి తండ్రులపేరులను వేరువేరగుటంజేసి యోచించవలసియున్నది. అందులో నరసింహరాయని తమ్ముడఁగు తిమ్మరాజుతండ్రిపేరు ఈశ్వరరాజైనట్లు మనుచరిత్రములోను పారిజాతాపహరణములో నున్నది. ఎట్లనగా:—

క. ఆయీశ్వరనృపతికిఁబు
త్ర్యాయుతమతియైనబుక్క - మాంబకు దేజ
స్తోయజహితులుదయించిరి
ధీయుతులగు నారసింహ - తిమ్మనరేంద్రుల్॥ అని.

ఇఁకను కృష్ణరాయమంత్రియగు తిమ్మరుసు తండ్రిపేరు "రాచయ్య" గానున్నట్లు ముందుమునము వివరింపఁబోవు శాసనమువలన గాన్పించెడిని. ఆకారణమున నీవరలో వివరింపఁబడిన తిమ్మరాజును తిమ్మరుసును నొకరుగారని సిద్ధాంతమేయగును. తిమ్మరుసునకు నప్పాజీయనుపేరు కృష్ణరాయలు పిలుచుటచేతనే కలిగెననియు నతనియథార్థనామము తిమ్మరుసనియు వివరించినదానికి సమాధానము చెప్పవలసియుండును. లోకమున గొందరికి నామకరణకాలమున నుంచఁబడిన నామమొకటియును, వ్యవహారమునఁ గలుగుచుండు నామమొకటియునుండుటగలదు. ఇట్టివానియందు గొన్ని బాల్యనామములును, మరికొన్ని పౌరుషనామములును నై యుండును. అటువలెనే తిమ్మరుసున కప్పాజీయనుపేరు బాల్యనామమైన కావచ్చును. పౌరుషనామమైనంగావచ్చును. ఆంధ్రదేశస్థులయందు బాల్యనామముగా, అబ్బాయి, బంగారబ్బాయి, పెద్దబ్బి, శాస్త్రి, పిల్లాపుధానులు మొదలగునవి కానుపించును. ఇఁక పౌరుషనామముల వాగను శాసను

డని, ఉభయకవిమిత్రుఁడని. ఆంధ్రకవితాపితామహుఁడనుమొదలైనవి వ్యవహారములందు రెండుపేరులలో దేనిం దెల్పిన నారెండుపేరులుగల వారూహింపఁబడుదురు. అటులనే తిమ్మరుసునకప్పాజీనామము బాల్యనామమైన కావచ్చును. కానిచోఁ బౌరుషనామమైనకావచ్చును. ఇటులనుండు రెండుపేరులొకకృష్ణరాయవిజయములో మాత్రమే కాన్పించుచున్నవిగాని తిమ్మరుసుచేసిన శాసనములలోఁగాని కృష్ణదేవరాయ శాసనములలోఁగాని కానుపించవు శాసనములనుక్క తిమ్మరుసనియేయున్నదిగాని రెండవపేరులేదు. కాబట్టి పంతులవారియూహాలు తిమ్మరుసు కృష్ణదేవరాయని పినతండ్రియనిగాని, లేకక్షత్రియుఁడనిగాని సిద్ధారణచేయజాలనివైనవి.

తిమ్మరుసునియోగిబ్రాహ్మణుఁడని.

ఆంధ్రదేశములోఁ గొంతకాలమునుండి వ్యాపకమునున్న ముప్పదియిద్దరునియోగులు, సీసపద్యము అనుదానిలో తిమ్మరసు పేరుండుటచేతనే యతఁడు నియోగిగా నిస్సందేహముగా బంతులవారంగీకరించవలయును. ఆపద్యములో సితిమ్మరుసుచరిత్రము *జెప్పసీసపాదమును, దాకిక

* ఇదివరలో నాకవిజీవితములో భట్టుమూర్తిచరిత్రములో దీనిఁ గూర్చి వ్రాసినాఁడను.

నుబంధములుగానున్న మరికొన్ని పద్యములు వినువారికివి నోదకరములను నుద్దేశముతో వివరించిరిగాని యథార్థశోధనార్థ ముపయోగింపలేదు. ఆపద్యములోనికథలన్నియు యథార్థములని నిశ్చయించి నేనిమాటవ్రాయుటలేదు. అదికేవలము "ముప్పదియిద్దరు నియోగులపద్యము" అనియుండుటచేత నద్దానిలో విషరింపఁబడినపేరులు వివరించునపుడు తగునిదర్శనములు చూపనిదే తమకుదోచినట్లుగా వ్రాయుట న్యాయముగాదని వివరించెదను ఇట్టిదానిలో నిపేరుతే మరికొన్నిటిని క్షత్రియులవిగా వ్రాసియున్నారు మొదట నీతిమ్మరుసునుగూర్చి వ్రాసి గ్రంథాధారములు చూపితక్కినవానింగూర్చి తరువాత వ్రాసెదను. ఆనిదర్శనములెట్లున్నవనగా.

### తిమ్మరుసుశాసనము

లోకల్ రికార్డులోని ౪౯ వసంపుటములో వివరింపబడినకొండవీటిసీమ మొదలగు స్థలములలోని శాసనములలో

౧౬ వ శాసనము.

శకం ౧౪౨౦.

శ్లో. శాకాబ్దేబహుధాన్య నామనినభో వేదాబ్ధిచంద్రాన్వితే।
కార్తిక్యాంశశివాసరే శుభతథౌ సింహాచలస్వామినే।
హారంకర్ణవిభూషణౌ చకటకే శ్రీకృష్ణరాయాధిపా।
మాత్యోరాచయసాళ్వతిమ్మః ప్రపతిః ప్రాదాద్విజన్మాగణీః॥ అని.

దీనింబట్టి యీతిమ్మరాజు బ్రాహ్మణుఁడనియును రాచయ్యయనునతని కొడుకనియున్స్పష్టమే- దీనికిముప్పదియిద్దరునియోగులపద్యములలోని సీసపాదము సంపూర్ణబలమిచ్చుఁగదా.

### సాళువతిమ్మరుసు శాసనములు.

### మద్దిరాలగ్రామములోని మాధవాలయావద్దనున్నది.

(జనరల్ నెంబరు 324)

స్వస్తిశ్రీశకవర్షంబులు ౧౪౩౭ అగునేటి యువసంవత్సర ఆషాఢ బ ౩ గురువారం శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర పూర్వదక్షిణ పశ్చిమసముద్రాధీశ్వర మూరురాయరగండ, అరిరాయవిభాళ, భాషిగెతప్పు [వరాయరగండ] శ్రీవీరప్రతాప శ్రీకృష్ణదేవమహారాయలు రత్నసింహాసనాసీనులై పృథ్వీరాజ్యము సేయుచుండగాను శ్రీమన్మహాప్రధాని సాళ్వతిమ్మరుసయ్యంగారు శ్రీమధురాపురిమాధవబేరి అమ్మవారికి అంగరంగవిభవాదులున్ను సాగించి దేవి అర్చనులైనస్థానంవారికిన్ని, గ్రామకరణములకున్ను, దేవరసేవచేసే సానెవారలకున్ను, భోగమువారికి, వూడుగాలవారికి, ప్రత్యేకవృత్తులవారికి యిచ్చిన ధర్మశాసనక్రమము మీకుమాన్యంబులు మొదలయిన మర్యాదలున్ను కట్నాలుకానికెలున్ను శ్రీకృష్ణదేవ మహారాయలకు పుణ్యముగాను ధారాగ్రహీతంచేస్తిమిగాన, ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించి బ్రతికేది. ఈధర్మానకు యెవరుతప్పినాను గంగదగ్గిరగోవులను బ్రాహ్మణులను చంపినపాపానబోదురు.

శ్లో. స్వదత్తాద్ద్విగుణంపుణ్యం । పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ । స్వదత్తంనిష్ఫలంభవేత్ ॥

(౩) కృష్ణదేవరాయనితో సమానముగ నీతిమ్మరుసు పేరునన్యులవలన వివరింపఁబడినశాసనము

బెజవాడలో పాపరాజుకుమారుడు సింగరాజు శా॥ స౧౪౪౦లో చేసిన శాసనములో నీక్రిందివిధముగానున్నది.

ఎట్లనగా:—

"ఇహాకిల జగతి సకలరిపుకులం విజిత్య, జయస్తంభమధిపాట్యమనూరుని ధాయ, నిజవశగజతురగబల మఖిలరాజ్యం సామ్రాజ్యంచ యవనపతేరఖిలం విజిత్యాబ్ధీనో విజయనగరమాసాద్య మణిమయమానుహ్య సింహాసనమఖిలమపి భువనభారం మూర్తిమతి విశ్వాసనిధానే, నిఖిలగుణానామతిశయనధామ్ని సాళ్వతిమ్మనామ్ని మంత్రిణి గుణతి విజితసురమంత్రిణి నిధాయ, పదవాక్యప్రమాణ పారదృశ్వానాం వరవిబుధపలాల మాతరిశ్వానాం మణీషిణామపి కావ్యనాటకాలంకార భాషావిశేష వేదినాం, చతుర్విధకవితా సామ్రాజ్యమధి నిష్ఠితానాం, కవీనాముపన్యస్త సంజీవనీ విద్యావతాం, మహతో గోష్ఠీషు, గరిష్ఠాసు, పతతమవని పతీపతి మనీషిత పూరణేషు చ, మనో నిధాయ, నిరవధిక సుఖలమవని సామ్రాజ్యసుఖమనుభవతి కృష్ణదేవమహారాయే న్యూనిపు గుణపతి జనాలంకారేణ వశిష్టగోత్రాలంకారేణ ... సదవనసావధానేన, సకలగుణనిధానేన, సింగరాజాభిధేయేన భాగధేయేన, మూర్తిమతా ముల్లాంబికా పాపరాజ మనోరథ త్తాం॥ అని

సాళ్వగోవిందయ్యశాసనము.

ఇతనితండ్రి పేరును సాళువతిమ్మరుసు తండ్రిపేరు నొక్కటిగా గాన్పించు. ఆ కారణమున నితఁడు తిమ్మరుసునకు సోదరుఁడుగా నూహింపఁబడవచ్చును. ఇది తాటిపర్తి గ్రామ

మునను న్న రామయ్యదేవరకుకుగా నీయఁబడినది. ఈశాసన
ముంబట్టి యీసాళ్వవారను. గృహనామముగల వారిగో
త్రము కౌండిన్యసగోత్రముగాఁ గాన్పించును. కావునఁది
మ్మరుసు నాగోత్రము వాఁడేయగును. ఆకారణమున నీతిమ్మ
రాజు కృష్ణదేవరాయనితో సగోత్రుఁడుగాక అన్యగోత్ర
మువాఁడగుననియు, నతని పినతండ్రియగు తిమ్మరాజితఁడు
కాఁడనియు మఱియొకపరి వివరింపవలసియున్నది. క్షత్రి
యులయందుఁగూడ నీగోత్రమున్నను ఆపస్తంభసూత్రము
యజుశ్శాఖాధ్యయనము గలవాఁడని చెప్పుటచేత నితఁడు
బ్రాహ్మణుఁడుగాని క్షత్రియుఁడుగాఁడని స్పష్టమే. పైనను
దాహరించిన సింహాచలము శాసనమున నితఁడు "ద్వి
జన్మాగ్రణిః" అని చెప్పియుండుటచేత నీయింటిపేరు గల
వారు బ్రాహ్మణులయందుఁగూడ నున్నట్లు వేరుగఁ జెప్పన
క్కఱలేదు. పైశాసనము క్రింద వివరించుచునే యున్నా
డను గావున నింతకన్న నిప్పుడు విశేషించి చెప్పను. ఆశాస
నమెట్లున్న దనఁగా:—

"స్వస్తి. శ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వర్షములు ౧౪౫౫
అగు నేటి శ్రీముఖ సంవత్సర మాఘ బ ౩౦ లు శ్రీమతు తాడిపర్తి
రామయ్యదేవునికి కౌండిన్యగోత్రం అపస్తంబసూత్రం- యజుశ్శాఖా
ధ్యాయులయిన రాచి రాజయ్యగారికుమారుఁడు సాళ్వ గోవిందయ్య
గారు దండము సమర్పించి యిచ్చిన భూదానదానశాసన క్రమమెట్ల

న్న సం- కృష్ణదేవరాయ మహారాయలు పృధ్వీరాజ్యం చేస్తూ వుండి మాకు నాయంకరానకు పాలించిన గుత్తిసీమలోని పెనకలపాడు ఇగడూరి పొలిమేరను, గడితిమ్మాపురం గ్రామానను తిధి శివరాత్రిపుణ్య కాలమందు విజయనగరము విరూపాక్షదేవుని సన్నిధిని తుంగభద్రా తీరాన సహిరణ్యోదక దానధారా పూర్వకంబుగాను ధారవోసి యిచ్చిన చేను ఖ ౧. అక్షరాలాపుట్టెడుచేను. రామయదేవుని అమృతపళ్లకు త్రివాచాను ధారపోసియిస్తిమి. ఆక్షేత్రానకు చెల్లే చతుస్సీమలోను గాంగల నిధి, నిక్షేప, జల, పాషాణ, అక్షీణ, ఆగామిసిద్ధసాధంబులనెడు అష్టభోగ తేజస్వామ్యములును అనుభవించుమని రామయదేవునికి అమృతపళ్లకు యిస్తిమి. అర్చకపారంపర్యంగాను. ఆచంద్రార్క సాయిగాను అనుభవించుమని రామయదేవునికి త్రివాచాను యిచ్చిన ధర్మశాసనం॥ స్వదత్తాద్ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం । పరదత్తాపహారేణ స్వదత్తంనిష్ఫలంభవేత్ ॥ అని.

పై గోవిందయ్యతాలూకు మరియొక శాసనము

కామలాపురము వృత్తాంతములో 'చదిపిరేల' అను గ్రామముయొక్క కైఫీయతులో శా॥ స॥ ౧౪౩౦ అగు విభవ సంవత్సరములో నీగోవిందయ్య శాసన వృత్తాంతము కొంత వివరింపఁబడినది. అదెట్లనఁగా:-

“ కామలాపురమునకు పడమర పరువుదూరమున చదిపిరేల అనే గ్రామము కొండిన్యసగోత్రం యజుశ్శాఖాధ్యాయులయిన రాచిరాజుగారి కుమారుఁడు గోవిందరాజుగారికి వీరనరసింగరాయలు నాయంకరానకు చెల్లే ఘండికోటదుర్గానకు చెల్లే మురికినాటిసీమలోను చదుపురేలగ్రామం అగస్త్యేశ్వరునకు సోమగ్రహణ పుణ్యకాలమున

హిరణ్యోదక దాన ధారా పూర్వకముగాను, ఆచంద్రార్క-స్థాయిగాను సమర్పించెను. ఇదిగాక సుంకము.

| | | |
|---|---|---|
| ౧. ఎనుమునకు. | ట | ౦ ౻ ౦ |
| ౨. ఎనుపోతునకు | ట | ౦ । ౦ |
| ౩. ఎద్దునకు | ట | ౦ ౻ ౦ |
| ౪. ఆవునకు | ట | ౧ । ౦ |
| ౫. గుఱ్ఱానికివక ౧౦ కి | ట | ౦ ౺ ౦ |
| ౬. ఒంటెకు ౫౧ కి | ట | = |
| ౭. పెండ్లికి ఆడబిడ్డకు | ట | ౧ |
| ౮. మొగబిడ్డకు | ట | ౨ |
| ౯. ఉభయం | ట | ౩ |

ఈమర్యాదను పాలిస్తిమి. గోవిందరాజువార్లు, అని ఈప్రకారము శాలివాహనశకవర్షంబులు ౧౪౩౦ అగు నేటి విభవసంవత్సరమార్గశిర శు౧౫లు చరిపిరేలగ్రామములోనున్న అగస్తీశ్వరుని దేవాలయం యెదుట శిలాశాసనవున్నది. అని.

## తిమ్మరుసు సంబంధువులు.

ఈమంత్రిశిఖామణికిని నాదెళ్ళవారను పెనుగుమరుపాడుగ్రామ మిరాసీదారులగు హరితసగోత్రికులకును సంబంధ బాంధవ్యమున్నట్లు కొన్ని కొండవీటి శాసనములవల్లను "ద్వాత్రింశ స్మంత్రిచరిత్రము,, వలనంగూడ గాన్పించు. అందు ద్వాత్రింశన్మంత్రిచరిత్రములో వివరింపబడిన నాదెళ్ళ అయ్యన్నమంత్రి యీతిమ్మరుసునకూతురు పెనిమిటిగా వివరింపఁబడినది. ఆకథలో చెప్పబడిన అయ్యలు మంత్రి

విశేషములు ప్రస్తుతములో మనము వివరింపవలసిన యా వసరము లేదు. కావున నాకథవివరింపక అందులోనిగాథలో వివరింపఁబడిన సంబంధము శాసనాంతరమువలన సిద్ధాంతీకరింపబడినదే గావున నదియాబద్ధమనుటకుగాని యాతఁడు క్షత్రియుఁడేయని సిద్ధాంతీకరించుటకుగాని వీలులేదు గావున నతనిమాట తిమ్మరుసు బ్రాహ్మణుఁడేనని మఱియొకపరి నిర్ణయించి చెప్పెదను.

ఇదిగాక శ్రీకృష్ణదేవరాయలు రాజ్యమేలుచుండగా వచ్చియుచటిదేశస్థితి, కృష్ణరాయల స్వరూపము ఆతనిరాజ్యాంగపద్ధతి మున్నగుననేకవిషయములను జూచియు, ఆ మహాప్రభునితో మాటలాడియు మన్ననఁబొందియున్న పోర్చుగీసుదేశస్థు లగున్యూనీజుయిట్లు వ్రాసియున్నాడు.

శ్రీకృష్ణదేవరాయలు ...... నగరములు నేలుచు, తే నకిష్టులగువారితో ముచ్చటించుచుండును. అందులో ముఖ్యుఁడు తిమ్మరుసు (మంత్రియగు సాళువతిమ్మరాజు) అనునొక వృద్ధబ్రాహ్మణుఁడుగలడు. అతఁడే రాజగృహ నిర్వాహకత్వమునకు యజమానుడు ప్రభువరులెల్లరును రాజుచెంగట నేరీతిగానుండెదరో యీతనియెడలగూడనట్టి భయభక్తులతో నుండెదరు, అనియును వ్రాసియున్నాడు.

న్యాయనీజు బ్రాహ్మణుల నెఱుఁగడేమో యనిన నట్లనుకొనుటకు వీలుపడదు. అతఁడు వేఱొకస్థలములో బ్రాహ్మణులనుగూర్చియు, వారి నడవడులనుగూర్చియుఁగూడ వ్రాసియున్నాడు. (17వ Page.)

కాబట్టి తిమ్మరుసు బ్రాహ్మణుఁడనియె నిశ్చయింపవలెను.

## తిమ్మరుసు అంత్యదశ

ఎంతపదవి ననుభవించినవానికైనను, బాలునికి వార్ధక్యమట్లు కష్టములు తప్పవు. ఆ బాల్యమునుండి తిమ్మరుసు శ్రీకృష్ణరాయలననేకవిధములఁ బోషించినను, తుదకు వారిద్దరికిభిన్నాభిప్రాయములు కలిగెననుట. తిమ్మరుసు చరిత్రాన్వేషణము నెఱిఁగిన వారికందఱికి పతనప్రాయముగా నుండును.

వీరనృసింహరాయలు మరణకాలసన్నుఁడగుటను, చిరుతప్రాయమువాఁడగు తనబాలకుని రాజ్యాభిషిక్తుని గావించు తలంపుతో నుండి యొకనాఁడు తిమ్మరుసును బిలువనంపించి యాతనియుద్దేశ్యమా మంత్రిపుంగవునికి నివేదించియిట్లనియె. మంత్రీ! ఇప్పని నెరవేరుట శ్రీకృష్ణరాయలవలన చిక్కులు కలుగును. కావున నేదైనయుపాయము పన్ని నాతని జంపి, జంపినందులకు నిదర్శనముగా నాతనికన్నులు జూపింపుమని నియమించెను

తిమ్మరుసు చిరకాలమునుండి రాజ్యభారము వహించినవాడగుటను, దేశాభిమానియుఁడగుటను, రాజ్యోద్ధరణమునకగు పనులేమియో చక్కగా నెఱుఁగును. అట్లగుటను నాతఁడిట్లు చింతించెను, "ఈ రాజ్యమునకు నలుప్రక్కలను శత్రువులుగలరు. విజయనగరరాజ్య విజయమంతయు శత్రురాజులగెలుచుటవలన సమకూడినది. కావుననీ రాజ్యమున నేమాత్రము సందుదొరికినను వారుముట్టడింతురు. ఈపని బాలకుని రాజుగాజేసిన కృష్ణరాయలీకొనఁడు. అతఁడు ధైర్యస్థైర్యా

దిగుణములచేతను, సౌందర్యముచేతను, శరీరపాటవముచేతను కూడ గడుఁబ్రసిద్ధుఁడు కావున నాతనికన్నులనెల్లుతీసి అతనినేగాక రాజ్యమునంతయును సంధతమసమున బడద్రోతును."

ఈప్రకారముననొని యీపల్కులనే శ్రీకృష్ణరాయలకు నివేదించెను. అతఁడాశాసనమునువిని నాకురాజ్యమునుపలదు, ఎందైనఁబోయిబిచ్చమెత్తుకొనెదను కన్నులుమాత్రముండనీయుమని వేడుకొనగానాతనిస్వభావమునుజూచి తిమ్మరుసు జాలిపొందినవాడయి నరసింహరాయలకు మేకకన్నులను గొనిపోయి కృష్ణరాయలకుని చూపెను. ఆతఁడందులకు బ్రీతుఁడైసంతసించి ప్రాణముపదలెను.

అప్పటినుండియును తిమ్మరుసు కృష్ణరాయలను కంటికిరెప్పవలె కాపాడి సింహాసనమెక్కించి రాజ్యమేలించెనుగదా, పిమ్మట కొంతకాలమునకుఁ దాతకుబోసిన సోలదడిలోనేయున్నదనునట్లు, కృష్ణదేవరాయలకు విజయవాంఛతీరినపిమ్మట, తనరాజ్యము నాలుండ్లబాలకుడగు తనపుత్త్రునికిచ్చి తాను మంత్రిగానుండి, తిమ్మరుసునెప్పటియట్ల నంతరంగికాలోచనములోఁ జేర్చుకొని కాలక్షేపము చేయజొచ్చెను. తిమ్మరుసునందలి ప్రేమచే రాయలు తిమ్మరుసుపుత్త్రుని దళవాయిగాను అతనిబంధువుల నందఱనక్కడక్కడ గొప్ప యుద్యోగములలో నుంచెను.

ఇట్లుండ రాయలపుత్త్రుఁడాకస్మికముగా మరణించెను. దానికారణమారయగా దళవాయిగానున్న తిమ్మరుసు పుత్త్రుని కొందఱుస్వార్థులకు తంత్రములను లోబడి యాతనికి విషము పెట్టించినట్లు తెలియవచ్చెను. తనయాపద్ధనమని తలంచిన కుమారుడట్లగుటను రాయలుకు ప్రచండకోపము వచ్చెను.

అంతట తిమ్మరుసును వారిబంధువుల నుద్యోగీయుల సామంతరాజుల నందఱిని బిలిపించి తిమ్మరుసుతో నిట్లనిరి. "నీవు నాకు రాజ్యమి

ప్పించినావు నన్ను కాపాడినావు రాజ్యమేయేలినావు అనేక మేలుల
జేసినావు. ఐన నందులను నేనేమియుఁ బ్రతిక్రియఁ జూపఁజాలను.
నీవు చేసినదంతయు నీయుద్యోగధర్మమునఁ జేసినావు. కాని మావం
శ మెప్పుడును రాజద్రోహచింతగలది. నా అన్న రాజ్యమేలుచుం
డగా నాతనికి మేకకన్నుఁ జూపి ద్రోహము చేసినావు. ఇపుడు నీ
కుమారుడు నాముద్దులబిడ్డను విషము ద్రావించి చంపినాడు ఇట్టి రాజ
ద్రోహులను పెట్టుకొని నేను రాజ్యము చేయలేను" అనిచెప్పి వారి
నందఱ ఖైదు చేసెను. తిమ్మరుసు ఖైదులో నుండెను. తరువాత తిమ్మ
రుసు పుత్త్రుడు చెఱసాలనుండి తప్పించుకొని దోపిడిగాండ్రతో
జేరి యొకదుర్గమున నివాసమేర్పఱచుకొని యుండెను.

ఇట్లుండగా నాతఁడు కొంచెము ప్రబలుఁడగుచున్నాఁడనువా
ర్త రాయలు విని వానిపైకి దండు బంపి, వానిని, ఆతని పినతండ్రి
యగు గోవిందరాజును, తండ్రియగు తిమ్మరుసునుబట్టి తెప్పించి యం
దఱకన్నులఁ బెఱికించెను

ఇట్టి ఘోరకృత్యమును జరిగించిన పిమ్మట రాయలు కాపాడి
నందులకు తిమ్మరుసు విచారింపక, తనపాపము ననుభవించి చెఱసాల
లోనే మరణించెను.

అప్పటినుండి తిమ్మరుసు చరిత్రమెట్లులేదో, కృష్ణరాయల చరిత్ర
మును అంతరించినది. ఈవిచారవార్త దేశమందెల్ల యల్లుకొనెను.
కృష్ణరాయలు కోపము పోయినతరువాత తిమ్మరుసును నిష్కారణము
గా జంపితినని పశ్చాత్తాపపడెననియు, నిక నీఘోరపాపముచే విజయ
నగర రాజ్యము నశించుననియు, విలపించుచు కొన్నాళ్లకు మర
ణించెను. వారి మంచిచెడ్డలు మాత్రము నిలచినవి విజయనగర రా
జ్యము నశించినది. పేరుకూడ పోయినది. విజయనగరము బ్రహ్మాణ